# ఉపోద్ఘాతము.

ఆంగ్లభాషయందు బైరనుమహాకవి రచియించిన Childe Harold's Pilgrimage అను కావ్యమును బఠించి యట్టి కావ్యము నాంధ్రమునందు విరచింపవలయునని యూహించికొనుచుండఁగా హాంపీవిజయనగరపు శిథిలసౌధములను జూచుట సంభవించెను. అట్టి కావ్యమును వ్రాయుటకుఁ దగిన విషయమిది యని యూహించివ్రాసినగ్రంథమే యీ చిన్నిపొత్తము. దీనినిఁ బ్రచురించుటకు ముందనేక సంస్థలలోఁ జదివితిని. ఆ వినిన వారిలోఁ గొందఱకైన నియ్యది కన్నీటిం దెప్పించుటఁ జేసి దీనిని బ్రచురింపఁ బూనుకొంటిని. ఈ ప్రచురణమున కెంతయు సహాయపడిన యానందముద్రణాధిపతులకు మిక్కిలి కృతజ్ఞుఁడను.

సహృదయులగువారీగ్రంథమును జదివి కావ్యపరమావధియగు నానందము నొసంగుచున్నదా, లేదా యనిపరీక్షింతురుగాక ? ఆనందమును గలిగించిన యెడల దీనినిఁగూడఁ దమ పుస్తకాగారముల యందుంపఁ బ్రార్థితులు. లేని యెడల విస్మృతగ్రంథసహస్రముల సంఖ్యకొకటి చేరునుగాక. మహాకవియయ్యును వినయముచేఁ గాళిదాసుఁడు రచియించిన

మందః కవియశః ప్రార్థీ గమిష్యామ్యుపహాస్యతాం ।
ప్రాంశులభ్యే ఫలే లోభాదుద్బాహురివ వామనః ॥

అనునుడి నాయందుసత్యమగునేమో యని శంకించుచున్నాను.

ఇందఖండయతి కొన్నికొన్నిచోట్లఁ బాటింపఁబడినది గాన పాఠకులు దీనిని భ్రమపూర్వకమని తలంపకుందురు గాక.

ఈ పుస్తకము ప్రూఫులను దిద్దుటకు సాహాయ్యమొనరించిన బ్రహ్మశ్రీ, వజ్ఝల - సీతారామస్వామిశాస్త్రిగారికిని మ-రా-రాశ్రీ, తాపీ - ధర్మారావుగారికిని నితరులగు మిత్రులకును వందనములు.

మదరాసు.
1-6-1930.

బుధజనవిధేయుఁడు.
గంటి జోగిసోమయాజి.

# చారిత్రిక కథాసారము.

విజయనగర సామ్రాజ్యము నంత్యదశకు సంబంధించిన చరిత్రము పాఠకులకొఱకు సంగ్రహముగా నీక్రిందఁ బొందు పఱుపఁబడినది.

విశాలసామ్రాజ్యమును బరిపాలించి చిరస్థాయి యగు కీర్తిని సంపాదించి పండితపుంగవుండనం బరఁగిన శ్రీకృష్ణదేవరాయలు గతించిన యనంతరమాతని సవతితల్లి కుమారుఁడగు నచ్యుతదేవరాయలును నాయన వెనుక దత్తనయుండగు వేంకటదేవరాయలును నాయనతరువాత నచ్యుతదేవరాయల యనుజుండగు శ్రీరంగరాయల పుత్త్రుండు సదాశివదేవరాయలును రాజ్యమును బరిపాలించిరి. పై వారిలో వేంకటదేవరాయలు చిన్నవాఁడై యుండ నాతని మేనమామయగు సలకము తిమ్మయ్య సంరక్షకుఁడై యుండి బలవంతుఁడై తుదకు బాలుఁడగు వేంకటరాయలను సంహరించి తానే రాజ్యము నపహరించి పరిపాలింపఁదొడగెను. శ్రీకృష్ణదేవరాయల కల్లుండగు నళియ రామరాయలు తనకుఁ దమ్ములగు తిరుమల రాయలను వేంకటాద్రినిం గూడుకొని యా సలకము తిమ్మయ్యను వధించి సదాశివరాయలకుఁ బట్టాభిషేకముచేసి తానే సంరక్షకుండై యఖండప్రతాపమున దేశమును బరిపాలించుచుండెను.

ఈతఁడు బలవంతుఁడై శత్రురాజులగు బహామనీసుల్తానులలో నొకరితో నొకరికిఁ గలహములు గలుగునట్లుచేసి, రాజ్యతంత్రజ్ఞుఁడై యెవ్వరికినిం దేఱిచూడ శక్యముగానట్లు వెలుంగుచుండెను. ఈతని యత్యాచారములచే మహమ్మదీయులందఱును మచ్చరించి కలసి యొక్కసారిగా విజయనగర సామ్రాజ్యముపై దండెత్తివచ్చిరి. ఈ యుద్ధమే తల్లికోట యుద్ధము. ప్రకృతగ్రంథమునందు వర్ణింపఁబడిన విషయము లన్నియు యుద్ధమునకు సంబంధించునవిగానే యున్నవి. ఇందు హిందువుల సైన్యపు సంఖ్య—ఒకలక్ష యాశ్వికులు; ఆఱు లక్షల పదాతులు, రెండువేల యేనుఁగులు. మహమ్మదీయుల సైన్యపు సంఖ్య—ఏఁబదివేల యాశ్వికులు, మూఁడువేల పదాతులు, ఆఱువందల శతఘ్నులు. ఈ యిరువురకును కృష్ణానది యొడ్డున యుద్ధము జరిగెను. హిందువుల సైన్యము మూఁడు భాగములుగా, ముగ్గురు సోదరులయధికారమునకు లోఁబడి యుద్ధముసేయుచుండఁగా రామరాయలయధికారమున నున్న నడిమిభాగమునందు హిందూసైనికులు తురకలఫిరంగుల దాడికి నిలుఁవఁజాలక పోఁగా రామరాయలు స్వయముగా సైనికులను బ్రోత్సాహముచేయఁ దొడఁగెను. ఇంతలో నేనుంగొక్కటి పిచ్చియెత్తి పయింబడుటచే రామరాయల పల్యంకి కావాహకులాపల్లకిని బాఱవేసి పాఱిపోఁగా శత్రురాజులువచ్చి యాయనను సంహరించిరి.

దీనిఁగాంచి సేనలు భయపడి పాఱిపోయిరి. తరువాతి విషయమంతయును బుస్తకమునందు పద్యములలో వర్ణింపఁ

బడినది. దీనిని గుఱించి స్యూయలు (Sewel) దొరగారిట్లు వ్రాయుచున్నారు.

"On seeing that their chief was dead, the Vizianagar forces broke and fled. They were pursued by the allies with such successful slaughter that the river which ran near the field was dyed red with their blood. It is computed on the best authorities that above one hundred thousand infidels were slain in fight and during the pursuit."

The Mussulmans were thus completely victorious, and the Hindus fled towards the Capital; but so great was the confusion that there was not the slightest attempt made to take up a new and defensive position amongst the hills surrounding the city, or even to defend the walls or approaches. The rout was complete.

"The plunder was so great that every private man in the allied army became rich in gold, jewels, effects, tents, arms, horses and slaves, as the sultans left every person in possession of what he has acquired, only taking elephants for their own use"

తిరుమలరాయాదులు పట్టణము విడిచి పాఱిపోయిరనుటకుఁ బ్రమాణము.

Within a few hours these craven chiefs hastily left the palace, carrying with them all the treasures on which they could lay their hands. Five hundred and fifty elephants, laden with treasure in gold, diamonds, and precious stones valued at more than a hundred million sterling, and carrying the state insignia and the celebrated jewelled throne of the Kings, left the city under the convoy of bodies of soldiers who remained true to the crown.

వీరు పాఱిపోయిన తరువాతఁ బట్టణము దొంగలపాలయిన దన్నందులకుఁ బ్రమాణము.

Next day the place became a prey to the robber tribes and jungle people of the neighbourhood. Hordes of Brinjaris, Lambadis, Kurubas and the like, pounced down on the hapless city and looted the stores and shops, carrying off great quantities of riches. Cowto states that there were six concerted attacks by these people during the day.

తరువాత మహమ్మదీయ సైనికులు దోఁచుకొన్నందులకుఁ బ్రమాణము.

. . . and from that time forward for a space of five months Vizianagar knew no rest. The enemy had come to destroy, and they carried out their object relentlessly. They slaughtered the people without mercy; broke down the temples

and palaces; and wreaked such savage vengeance on the abode of the Kings, that, with the exception of a few great stone built temples and walls, nothing now remains but a heap of ruins to mark the spot where once the stately buildings stood. . . . . . They lit huge fires in the magnificiently decorated buildings forming the temple of Vitthalaswami near the river and smashed its exquisite stone sculptures. With fire and sword, with crowbars and axes, they carried on day after day their work of destruction. Never perhaps in the history of the world has such havoc been wrought, and wrought so suddenly, on so splendid a city: teeming with a wealthy and industrious population in the full plenitude of prosperity one day, and on the next, seized, pillaged and reduced to ruins, amidst scenes of savage massacre and horrors beggaring description.

ఇట్లు పైనిజెప్పిన కథా సందర్భమునే గ్రహియించి నేను నాగ్రంథమునందు వ్రాసితిని. క్రొత్తగా 'హీరాస్'గారు ప్రచురించిన 'ఆరవీడు వంశచరిత్రము'నందు కొన్నికొన్ని యభిప్రాయభేదములు సూచింపఁబడినవి. అందు ముఖ్యమయినది హిందూసైన్యములలో నుండిన యిరువురు తురకసైన్యాధిపతులు ద్రోహముచేసి యుద్ధమధ్యమున వీరిని విడిచిపోయిరని వ్రాయఁబడినది. నేనీ గ్రంథమును వ్రాయునప్పటికా గ్రంథమింకను బ్రచురింపఁబడలేదు. ప్రచురింపఁబడిన తరువాత నేను దానిని చాలకాలమువఱకును జూచుట సంభవింపలేదు.

ఇంతకును గావ్యము విభావాదుల మూలమునఁ బాఠ కుల మనస్సుల యందానందాపరపర్యాయంబగు రసము నుత్పత్తిచేయుటయే ముఖ్యోద్దేశముగాఁగలది. చారిత్రకాంశమే ప్రధానముగాఁ గలది కాదు.

నేను రచియించిన పద్ధతికిఁ బ్రమాణములను బయినిచ్చి యున్నాను.

గంటి. జోగిసోమయాజి.

# A FOREWORD.

BY

PROFESSOR P. SUBRAHMANYAIYAH,

*Professor of English, Pachaiyappa's College,*

*Member, Board of Studies in Telugu,*

*Madras University.*

Good wine needs no bush ; and a noble poem, the ripe fruit of intense brooding and mellow scholarship, does not stand in need of a prelude and least of all, an amateurish one.

Vidwan G. J. Somayaji's new poem entitled "Ramachandruni Hampi Yatra" (Ramachandra's Pilgrimage to Hampi) is bound to make a strong appeal to lovers of poetry by its subtle and delicate music and its inspiring and entrancing theme without the ceremonial appendage of an introduction. The transparent merit of the poem is its sole passport to recognition : and its steady poetic glow and the compelling urge of its message are its chief and enduring glory. But the author, hovering between the world of tradition so hard to transgress, and the world of emancipation from convention, powerless yet to be born, is superstitious enough to need it and I am not heretic enough to resist a request, backed up by such affectionate regard and winning persuasiveness of one bound to me by ties of fellowship in service and intellectual tastes.

It requires wary walking to enter even the outskirts of the Muses' Abode. It takes years of consecration to help in worship at the shrine of the poets. One has need of మడి (sanctified robes) to perform the priestly office of laying Mr. Somayaji's fragrant offering at the Altar and invoke the benediction of the powers that touch the lips of the singer with poetic fire. With the pilgrim Ramachandra, let us invoke the grace of the master-minds whose songs overflowed the spacious eras of Pericles, Augustus and Elizabeth

and rendered them epoch-making. The author's soaring ambition makes him seek for inspiration from lands, far and near, from the dim past and the living present. What he prays for in his sublime invocation is vouchsafed to him in some measure at least, as is attested by the copious diction, daring imagery and lofty thought of the poem.

In the realm of verse opened up by the poet, I am no blind sojourner. I have thrilled to the melody of the verse as it crept in on me in studious seclusion or as it has been borne in upon me by the recitative talent of the bard. With the key supplied by the hero Ramachandra (who by the way seems to be a subtle but transparent veil for the author himself) I have been able to get vivid glimpses of the region traversed by the devoted pilgrim from the mighty rush and roar of the spacious Godavary to the stately portals of Virupaksha and the decayed towers and mouldering fanes of Hampi. To the interpretative genius of the author, I owe the insight I have been able to get into the thoughts that flit about the grim seclusion of Hampi and the host of ideas that have been adventuring in the mind of the contemplative pilgrim.

Attuned as my ears have been to the melodies sung by other bards in other climes, I have found contact with Ramachandra's mind bracing and delightful. It is now my fond wish to beckon other pilgrims to this enchanted region, so that they may fare forth in the company of the hero and find "sermons in stones, books in running brooks and good in everything."

To be able to assay adequately the power that lives in the poem and the delight it can give, we have to break up the fabric of the poem and study the arts and processes whereby the weaver of the verse has constructed his song. Only by such analysis can we see how the floor of the poem comes to be inlaid with the patines of bright verse. What produces the spell of the poem is the cultivated personality of the poet and the heritage of culture that has come down to him, from eastern windows and western channels. Ramachandra's equipment—and if the disguise is laid

aside, Mr. Somayaji's equipment—is of a high order. He has drunk freely of the culture of the west. Haunting melodies of western poets freely intermingle with his eastern strains, thus vindicating the West and vitalising the East. He has tempered the thought, mythology and creeds of the East with the spirit of the West and has managed a remarkable fusion of both, throughout the three cantos of the poem Ramachandra voices forth the eternal, irrepressible longing of every easterner to take the belated pledge of drinking deep of Sanskrit lore and with the hero one might exclaim :—

నింకనైనఁ జేపట్టవలెఁ గదా పరమ ।
పావన సంస్కృతగ్రంథ జాలముల్ ॥

It is superfluous to say that he has garnered up the hoarded sweets of Telugu Poetry at its highest and purest and his culture is reinforced by familiar excursions into the realms of Sanskrit gold. To a trained chemist, a stone, whether in the holy shrine or on the pavements of the citadel might be just a stone and no more, but the poet-philosopher knows the poetic Alchemy whereby stone can be turned into gold. Mr. Somayaji has been anxious to furnish his poem with a solid back-ground of facts and by his transmuting touch he has redeemed historic records from dryness and dullness. Mr. Somayaji's theme has been probably conceived in the uplifting atmosphere of Vizianagar; by gazing on Vizianagar that *is*—one is tempted to revive memories of Vizianagar that *was*. It is no small privilege to be nursed in Vizianagar and bred up to the cultural and poetic traditions of that great seat of learning. In and about Vizianagar there have arisen devoted and gifted interpretors of the Andhra History and genius. Mr. Somayaji has that classic mantle on and is one of those kindred souls that have pledged themselves to bring honour and renown to the Telugu Land and Telugu Culture. Bred up to traditions so varied and so honourable and nursed in a congenial atmosphere and steeped in thoughts, the spoils of different ages, cultures and nations, it causes no surprise that he has boldly essayed the task that he has accomplished with such signal credit. It is with a trained eye and a cultured vision

that he has contemplated on 'the sad relics of departed worth'—the glory that was Krishnadevaraya and the grandeur that was Hampi.

Ramachandra is the counterpart of 'Childe Harold'; and the creator of Ramachandra is proud to be a reverent disciple of Byron. The frame-work of the poem is the poetic diary of an adventure by a Modern Ulysses—athirst for enterprise of body and mind. The first Canto is concerned with the travels of the sad and world-weary pilgrim and furnishes the occasion for the story of the hero's life, his early hopes and ambitions. It reveals a panorama of nature as she appeared in all her glory in the regions traversed by the wanderer.

From pastoral glimpses, the poem passes on to the treatment of man. Two men stand out from the canvas—Krishnadevaraya and Thimmarusu; their full-length and vivid portraits are among the finest specimens of biographic treatment.

There is not a single poetic emotion or mood from the slightest to the most heart-moving that has been neglected by the poet. He strikes the lyre; the chord of self passes out and love of country possesses the soul. The pilgrim turns away with disgust from the city with its divided aims and distractions, its hurried life and bustle and meditates on the charms of rustic quiet and simplicity.

In the pen portrait of Krishnadevaraya, patriotism and literature go hand in hand, the very relics speak of the greatness of the past and the reader feels that it is a great privilege to speak the tongue that the hero spoke and hold the faith and morals he did. The whole stretch of the empire is replete with heroism and culture, and gazing on such scenes, breathes there a soul so dead as not to say "This is my own, my Andhra Land"? The glories of the old empire have vanished, but though fallen, they are great and though no more, yet immortal.

In Canto III, stanzas 74–81 contain a very ably conducted discourse on the problem of evil and human imperfec-

tion. Since absolute truth is unattainable and ideal moral goodness illusory in this rough and imperfect world, we should not repine at our lot but stand at the post of duty and rough-hew our destinies with such moral compasses as have been forged for us. Stanzas 50 and 51 reveal a picture of intense personal devotion between Thimmarusu and Krishnadevaraya, scarcely surpassed in the annals of classic friendship. Dull is the eye that cannot weep as the poet laments over the ebbing away of Vizianagar-glory in the haunting elegiac refrain :—

విజయనగరాన వెలసిన విజయలక్ష్మి ॥

Whose heart will not break at this moving recital which brings out the pathetic contrast between its past glory and its present brooding and grim desolation ?

The line నాఁడే లేనిదీ మహానవమి దిబ్బ calls up tersely and vividly the vanished glory and buried worth of the empire. As the poem recounts the deeds of valour done, we feel that the Andhra fire and valour are still smouldering and at the bidding of master-magicians like the ‘Soul of Valour’, the good old days of Andhra heroism are called up once again in response to the trumpet-blasts of such martial music.

The second canto is full of religious inspiration. As one gazes on the historic temples and meditates on sacred Vitthala and Virupaksha—one cannot but realise the difference between the immensity and omnipotence of God, and the atom-like slenderness and littleness of man. The author makes us realise that we tread on holy and inspiring ground—hallowed by a thousand venerable memories and associations and that there is beauty in desolation and greatness in ruin. Vizianagar . . . is not dead ; even death the conqueror cannot overcome it. As Masefield sings of the past glories of Troy,

The Atlanteans have not died
Immortal things still give us dream,—
The dream that fires man's heart to make,
To build, to do, to sing or say
A Beauty death can never take.

Viewed in all its aspects, the poem is destined to win for itself a high and honoured place in the field of modern poetry.

In its style there is a happy union of simplicity and sublimity. The author rejects with equal scorn, coinage base and vulgar as well as glittering tinsel. The poet has saved Modern Telugu Poetry from the curse of barrenness and commonplaceness and set it on the high road to progress.

Modern Poetry may revel in trivialities or dally with artistic trifles but it requires courage and culture to temper it with high seriousness.

In the handling of history and historical documents, the author has been judicious and the poem is set amidst a background of solid historic fact. The seductive rhymes, the overflowing melody, the felicity of simple but stately words reveal the poet's mastery of diction. In its prevailing cast of thought, the poem starts amidst a pessimistic wail and ends in a buoyant and hopeful note. In the revival of memories of Andhra greatness and the appeal to Andhra heroism and culture, the Poet is superb. The sentiments in the poem are interlarded with gleanings from classics—of high lineage, whether of Western or Eastern Poets.

In its construction there is a scientific outlook and the poem makes a poetic whole—artistically treated and elaborated. By his artful borrowing, the author enriches the poem with Keatsian grace, Shelleyan fire, Miltonic sublimity, Shakespearean felicity and Byronic energy. In a few parts of the poem, the author has boldly enslaved the beauty of Western thought and subdued it to the atmosphere of the East.

It is a subtle and inimitably delightful way of annexing British Empire to Indian thought and enlarging the bounds of knowledge and the domain of thought in the Telugu world. The author has deftly woven into the poem marvels of poetic grace and charm, now standing on the

poetic highlands of the Bharata, now sauntering in the lovely gardens of Mukku Timmana, and now perched on the serene and sublime heights of Allasani Peddana.

When a decade or two shall have passed, and we of the Telugu Land take stock of the achievements of Modern Poetry Mr. Somayaji will take rank with those poets who have displayed the fearless courage to avoid beaten tracks and strike out new paths, can walk with a firm and masterly tread, and enhance the harmony of the language by lines of haunting melody.

Modern poetry is justified of its children ; one poet makes an epic of 'a drop of water', another weaves lovely wreaths of pastoral song, in racy, colloquial style, yet another addresses himself to a laborious imitation of an old classic and believes that to perpetuate the past is to ensure the future ; while to Mr. Somayaji is reserved the privilege of treading on historic stones and relics, awakening slumbering poetry, releasing incipient patriotism and kindling martial vigour by the pageant of heroes reviewed in the poem. This moving poem is bound to be no mean inheritance for the Telugu Literature.

I could, if I try, play the role of a finical and meticulous critic and point out a flaw here, and a stain there, but such office I leave to those who have the lust for criticism of that type. I am frankly content with scanning its merits and stressing its bright points and sending it forth into the literary world with a blessing in the hope that it will not merely divert the dull disposition or the vacant monotony of an hour but be a source of perennial delight and inspiration to all lovers of the fine art of Poetry.

MADRAS.
*15th November* 1930. PRAKATHURU SUBRAHMANYAM.

M. R. Ry.

M. VENKATARANGIAH GARU, M. A.

*Principal V. R. College Nellore writes,*

*Nellore,*

21-10-30.

Dear Mr. Somayaji,

I have gone through your book. I am very much impressed by the beauty and the dignity of your poem. It is a piece of work in an untrodden field and the graphic description it gives of the Telugu Country in general and the ruins of Hampi in particular is of a masterly character. It deserves a high place among modern Poetical Works * *

Yours sincerely,

M. VENKATARANGIAH.

# కృ తి భ ర్త.



మ॥రా॥శ్రీ.

దివాన్ బహద్దరు.

ఆర్కాటు - రామస్వామి మొదలియారుగారు బి. ఎ., బి.ఎల్.

భారతశాసన సభాసభ్యులు

XIX. మదరాసు పురపాలక సంఘాధ్యక్షులు.

శ్రీశారదాంబాయై నమః.

“ శ్రీవాణీగిరిజాశ్చిరాయదధతో
వక్షోముఖాంగేషుయే ।
లోకానాం స్థితిమావహంత్య
విహతాం స్త్రీపుంసయోగోద్భవామ్ ।
తే వేదత్రయమూర్తయస్త్రిపురుషా
స్సంపూజితావస్సురైః ।
ర్భూయాసుః పురుషోత్తమాంబుజ
భవశ్రీకంధరాశ్శ్రేయసే ॥” నన్నయ

---

సీ॥ ఎవ్వనియాజ్ఞను ✤ నినుఁడు చరించును
నిత్యమ్ము విడక ని ✤ ర్ణీతపథము ।
కోటానఁగోటులై ✤ వాటిల్లునుడుగోళ
వితతి యెవ్వనిస్వేద ✤ బిందుపాళి ।
వికసించుపూమొగ్గ ✤ విలసిల్లునెవ్వని
సువ్యక్తశక్తులు ✤ సూక్ష్మగతిని ।
నెవనిసత్తయె యెల్ల ✤ యురవులఁగాన్పించి
స్థితినిఁగల్పించు నీ ✤ సృష్టికెల్ల ॥

గీ॥ నఖిలజగముల కారణం § బగు నెవండొ
యట్టిసచ్ఛక్తిమయుఁడగు § నట్టిదేవుఁ ।
డాయురారోగ్య భాగ్యంబు § లధికముగను
నిచ్చిమత్కృతిభర్త రక్షించుఁగాత ॥ 1

సీ॥ వనములఁదపియించు § మునులకుశ్రుతిరూప
మున సత్యముదెల్పు § ఘనుఁడెవండు ।
పొదలోని మంటలో § మోసెస్సునకుఁ దోఁచి,
ధర్మసూత్రాలనే § తాతదెలిపెఁ ।
దనకుమారునిఁబంపి § ధర్మైకమార్గంబుఁ
బల్కఁజేసినభగ § వంతుఁడెవఁడు ।
హీరాగిరింద్రమ్ము । నెక్కు మహమ్మదు
జ్ఞానిఁజేసిన మహా § జ్ఞానియెవఁడు ।

గీ॥ అన్నిమతములకొక్కఁడై § యలరునెవఁడు ।
అట్టియీశుండు శుభముల § నమరఁజేసి ।
రామసామినినాతని § భ్రాతృవరుల
సంతతానందమునఁ దేల్చి § సాఁకుఁగాత॥ 2

చ॥ కృతులరచించి కొందఱు క
వీంద్రులు రాజులకో మహాధనో ।
ద్ధతులకొ యిచ్చివారికడ
ద్రవ్యముఁ బొందిరిగాని మాకు నా ।
కత యిసుమంత చెల్లదు; సు
ఖంబగుప్రేమము గౌరవంబునుఁ ।
హితమును గారణంబులుగ
నిచ్చెదమత్కృతి రామసామికిఁ ॥ 3

ఉ॥ వ్యక్తికి వ్యక్తికిఁ గలుగు
బంధములాంతరకారణంబులన్ ।
వ్యక్తములయ్యెడున్, వెలియు
పాధులఁ బ్రేమము లాశ్రయింపవన్ ।
సూక్తి నిజమ్మమాయెడను
సుస్థిరమైన యనేకబంధముల్ ।
ప్రాక్తన జన్మవాసనల
భాసిలునందురు శాస్త్రకోవిదుల్ ॥ 4

గీ॥ ఆఱువర్షమ్ములకు ముందు నయినపరిచ
యమ్మువడిగవర్థిలిబల మైనమైత్రి ।
యగుచుఁ నిప్పుడీరీతి కా వైక్యబంధ
మై ఫలించెను; విధికృత మబ్బురంబు ॥ 5

ఉ॥ కాలమహాప్రవాహమున
క్షాళితమై జనవృత్తనామముల్ ।
తీలయిపోవు బుద్బుదవి
ధిన్, గవిసత్కృతులన్నలంకలం ।
దేలినవారి నామములు
నిల్చుస్థిరంబుగ నందురెల్లరా ।
లీలనె శాశ్వతమ్మయివె
లింగెడు మత్కృతినాథువృత్తమున్ ॥ 6

మ॥ మొదలై పంటవలంతిప్రాపుగొని స
మ్మోదంబుఁ గల్పింపఁగా ।
మొదలై యార్థిక రాజకీయముల సం
పూర్ణంబు శాసింపఁగా ।

మొదలార్ నాఁజనుసార్థకావ్వాయమునన్
బొల్పొందువంశంబులో ।
నుదయంబందెను కుప్పసామి సుగుణా
న్యూనుండు పుణ్యాత్ముఁడై ॥ 7

సీ॥ అలటిప్పసుల్తాను * నాజ్ఞానువర్తులై
యలరు వీరులవంశ * మందుఁబుట్టి ।
యార్కాటులోవిద్య * నభ్యాస మొనరించి,
కర్నూలులోరాజ * కార్యదీక్ష ।
నుద్యోగగరిమను * నొప్పారి ఋజుమార్గ
వర్తియన్ ఖ్యాతిని * వాసిగాంచి ।
మనసులోవర్తించు * ననుకూలగతియైన
కులకాంతసిద్దమ్మ * కుక్షిఁగనియె ।
గీ॥ సుతులఁ జెక్కండ్ర కుపుసామి * యతులమతుల ;
వారిలోరత్నములఁ బోలి * వఱలు రామ ।
సామి, దొరసామి, లక్ష్మణ * స్వామియనెడు
వారు దక్షులై కీర్తిని * బ్రబలువారు ॥ 8

చ॥ ముగురును మూఁడురత్నముల
మూల్యులు, పల్కినపల్కు నిల్పఁగాఁ ।
దగినసమర్థులాప్తులకు
దారులు, నమ్మిన మంచికెద్దు దా ।
మగుదురు, వీరువారనక
న్యాయమునెల్లర కబ్బునట్లుగాఁ ।
దగుపని సేయుచుందురు, స
ధర్ములు, మీఁదనికేమి గావలెన్ ॥ 9

గీ॥ మాలికను వెల్గునాయక మణివిధాన
నామహితులలో నలరారు రామసామి।
మొదలికర్పింతుఁ బ్రేమనీ పుస్తకంబు
తనరుఁగావుత మాచంద్ర తారకముగ॥ 10



# విషయసూచిక.

## ప్రథమాశ్వాసము.

పద్యముల సంఖ్య.



## ద్వితీయాశ్వాసము.



## తృతీయాశ్వాసము.

శ్రీ శారదాంబాయై నమః.

# రామచంద్రుని హంపీయాత్ర.

## ప్రథమాశ్వాసము.

---

సీ. కలపికస్వనములఁ  గండచక్కెరఁ దీపి
        వాల్మీకిఁ బల్కించు  పరమశక్తి ।
    పలుకుమిఠాయినా  భాసిల్లు వర్ణనల్
        దెలిపిన హోమరు  దివ్యశక్తి ।
    ఫలరసమ్ముల నెల్ల  వర్షించి హాయిని
        గావించు షేక్స్పియర్  జీవశక్తి ।
    గంగాజలమ్ముల  కమ్మందనమ్ముల
        రుచి చూపు తిక్కన్న  రూఢశక్తి ।

గీ॥ ప్రళయనిర్ఘోష భీషణా  రావకలిత
    రంగదుత్తుంగ భంగాళి  నింగిముట్టు ।
    నల 'నయాగరా' జలపాత  మనెడు తీవి
    వెలయు 'బైరను' వాగ్ధాటిఁ  గలుగుశక్తి ।
    యున్నియును గూర్చు నాకావ్య  మందుఁ దల్లి ॥ 1

సీ॥ అణువులు మొదలుగా  నాబ్రహ్మమౌదల
        నాడింపలేదె రా  మాయశాబ్ధి ।

పాశ్చాత్య విజ్ఞాన ‌ భవ్యుల మైమఱ
పించదె ! యొడిసియస్ ‌ వింతచరిత ।
పుట్టుపుట్టంగల ‌ పురుషోత్తములనెల్ల
మ్రొక్కించికొనవె ! యారూపకములు ।
భావగౌరవమున ‌ బాగెఱింగినవారు
భళియనఁజేయదే ‌ భారతమ్ము ।

గీ॥ వీరశృంగార కరుణాద్య ‌ పారసక్తిఁ
గల్లజేయదె వైరను ‌ కావ్యసరణి ?
యిన్నివిధముల రూపెత్తి ‌ యిన్నిచోట్ల
తాండవించితిగదె ! కవి ‌ తామతల్లి ! ॥ 2

ఉ॥ వారురచించినట్లు, త్రిది
వమ్మున భూతలమందు శ్రేష్ఠమౌ ।
నారకథావళుల్ గొనియ
జస్రసరస్ఫురణమ్ము గొల్పు, నా ।
ధారణుడైన మానవు క
ధఁగొని తద్హృదయాంతరమ్మునన్ ।
బాఱిన భావ వీచికలఁ
బైటికిఁ దెచ్చెది నేర్చినట్లుగాఁ ॥ 3

ఉ॥ వారికిఁ బక్షపాతము న
వారితభంగినిఁ జూపియుంటివే ।
వారయుమమ్మ ! నన్నుదయ
నావిధి; సృష్టికి మూలశక్తి గం ।
భీరమహార్ణవంబులను
వెల్లువలందును నెట్టులాడు, నా ।

తీరునఁగుందసూనముల
తీయనివాసనలన్ రమింపదే॥ 4

క॥ అమ్మా! భావసుమమ్ముల
కొమ్మా! సత్కవితనయులకున్ ఘనమౌ భా
గ్యమ్మా! సరసపురచనల
యిమ్మా! మాయమ్మ! నాల్కకెక్కుమ! లెమ్మా!॥ 5

సీ॥ ఒకప్రక్క క్షాత్రమిం కొకప్రక్క బ్రాహ్మ్యంబుఁ
దీండ్రింపనెవ్వాఁడు తేజరిల్లె।
చాపమ్మునొకచేత శాపమ్ముమఱుచేతి
నాయుధమ్ములఁదాల్చి యలరెనెవఁడు।
జనకునానతిసేయఁ దనతల్లి శిరమును
బరశువుచేఁబూని నఱికెనెవఁడు।
తనపితృఋణముఁదీర్ప ఘనరాజరక్తంబు
తర్పణమిచ్చిన ధన్యుఁడెవఁడు।

గీ॥ దుష్కరారంభ విలసిత దోఃప్రతాప
భానుసమమాప్రదీప్తప్ర పంచుఁడెవఁడు।
అట్టిరాముండు మూలమై యలరియున్న
సత్కులపుఁబట్టి మారామ చంద్రమూర్తి॥ 6

చ॥ తాతయుఁ దండ్రి తాతయు స్వ
ధర్మరతుల్ సకలాగమార్థవి।
జ్ఞాతలునయ్యు నాగము వి
చారమె దెల్పక మాణావిద్యలం।
దాతనిఁ బెద్దఁజేసిరి ధ
నప్రదమై బాలుపొందు విద్యకున్।

దాతలు నర్థులుఁ గలరు
ద్రవ్యమె లోకమునందుఁ బూజ్యమా ॥ 7

మ॥ ధనమాసించిన నేమి ? నౌఖరికి న
త్యంతంబు యత్నంబున ।
ల్పిన నేమయ్యెను ? దుష్టసంఘునియమా
పేతాత్ములై, సత్యముఁ ।
గనయత్నించిన యాంగ్ల భూజనుల వి
జ్ఞానమ్ము నార్జింప రా ।
మునకుం దండ్రి సహాయకుం డగుచు నా
మోదించె నద్దానికిఁ ॥ 8

గీ॥ పాఠశాలను నేర్చెదు పాఠములను ।
శ్రద్ధతో నేర్చి యుత్తమ స్థానమందె ।
యెప్పుడలరుచు నేటేటఁ దప్పకుండ
నగు బరీక్షలను త్తీర్ణుఁ డగుచునుండె ॥ 9

ఉ॥ తల్లికి మోదకందమునుఁ
దండ్రికిఁ బ్రాత్కమలాతపమ్మునౌ ।
పిల్లఁడు విద్య నేర్చెదు న
భీష్టముతోఁ బోరు గూరి కేగుచోఁ ।
వల్లెయటంచుఁ గష్టమునఁ
బల్కిరి భావిశుభోదయంబు సం ।
ధిల్లెడుచో వియోగము స
హించుట న్యాయమె యెట్టివారికిఁ ॥ 10

సీ॥ గుబురులై లోలోనఁ గూడెడు భావాల
వెలిఁ జేసెనెచ్చోటఁ దెలుఁగునినువు ।

ఎల్లబాసలకును § దల్లినినెచ్చోట
నర్చించెఁదొలుదొల్త § నాంధ్రవనిత ।
ధర్మైకపాలనా § దక్షుఁడై యెచ్చోట
రాజ్యమ్ముఁ శాసించె § రాజరాజు ।
ఆంధ్రజాతీయతా § సాంద్రబీజావళుల్
వర్ధిల్ల నెచ్చోటు § పాటిపట్టు ॥
గీ॥ పరమపావన గౌతమీ § వారిఁద్రావ
నలరునెచ్చోట నత్యున్న § తాశయములు ।
తెలుఁగుఁదనపుఁ గాణాచినా § వెలయుచుండు
నేది ! యట్టిశ్రీరాజమ § హేంద్రపురము ॥ 11
గీ॥ రాముఁడేగెను,దత్పురిఁ § గ్రాలునట్టి
సత్కళాశాలఁ బాశ్చాత్య § శాస్త్రతతుల ।
నన్నిటిని నేర్చి యుత్తీర్ణు § డగుచునుండి
తలఁచెనొకనాఁడు వాసనా § బలము వెలయ ॥ 12
ఉ॥ పుట్టిననాఁట నుండియును
బూజ్యములౌ మనవారిశాస్త్రముల్ ।
పట్టక యన్యశాస్త్రములఁ
బారమొనర్చితి నార్యకల్పనా ।
కుట్టిమపంక్తు లందుఁజనఁ
గోరకయుంటిని, నింకనైనఁజే ।
పట్టవలెన్ గదా పరమ
పావనసంస్కృత గ్రంథజాలముల్ ॥ 13
మ॥ అని లోనెంచుచుఁ గావ్యనాటకకళా
వ్యాఖ్యానముల్ సూచియున్ ।

ఘనశాస్త్రమ్ము లెఱుంగు కోరికను ద
ర్కవ్యాకృతుల్ గూడనే।
ర్చెను రాముండు; మహాప్రయత్నమున నా
ర్జింపంగ నూహించినన్।
ఘనులౌ వారికి నోటముల్ గలవె సం
కల్పించు నర్థమ్ములన్॥ 14

ఉ॥ పట్టపరీక్షలో జయము
వాటిల నాతఁడు పాఠశాలలన్।
గట్టిన శాంతి కాలమునఁ
గాంచఁగ నేగెను దల్లిదండ్రులన్।
గట్టిఁడి దైవ మిట్లు పయి
గ్రామమునన్ బడవేయ నెట్టకేఁ।
బుట్టిన యూరి కేగుతఱిఁ
బొంగెడుసంత సమెంత యోగదా॥ 15

మ॥ జననీరూపము కంటె మానవునకున్
సంతోషమున్ భక్తియున్।
మొనయింపందగునట్టి దొండొకటియీ
భూలోక మందున్నదే?
కన జీవాంకుర జాలముల్ బెఱుగ మే
ఘత్యక్త నీరంబ, యీ।
జననప్రాప్తికిఁ గారణమ్మయిన సా
క్షాన్మాతృదైవమ్ములన్॥ 16

మ॥ ప్రణయాధిక్యము స్తన్యరూపమున ది
వ్యంబౌ ప్రవాహంబుగాఁ।

దనునాడీవివరప్రవేశమున గా
త్రంబెల్ల వ్యాపించి పా ।
వనసత్త్వమ్మునొసంగు చుంకునుశిశు
త్వంబందుఁ దర్వాతియా ।
వనకాలమ్మున నిర్మలత్వమునుస
ద్భక్తిన్ బ్రసాదింపదే ॥ 17

గీ॥ అట్టితల్లిని బూడంగ నతఁడుసనియెఁ
బిల్లవయసునఁ బెరిఁగిన పల్లెటూరు ।
పాఠశాలల మూయుట బాలకులకు
కనకజలమజ్జనముగా దె కనుగొనంగ ॥ 18

ఉ॥ తానొకిటెంచు చున్నతటి
దైవము వేరొక టెంచుననన్నమా ।
ర్గానను రాము చంద్రుఁడు సు
ఖంబుగనింటికి నేగియున్న కా ।
లానకుఁదండ్రి కొక్కపులి
లాగునఁబెద్ద జ్వరంబు వచ్చె నె ।
ద్దానసుగూడ నించుకయు
తగ్గకపోయె నదెట్టిపాపమో ॥ 19

గీ॥ దినము పరిచర్యసలిపినఁ దేఱఁడాయె
ప్రాణహానియుఁ గాలమ్ము పఱచు కొలఁదిఁ ।
బరుగువెట్టెను ముంగల వైపె వ్రావ
మందుపగ్గాల నించుక మఱలలేదు ॥ 20

ఉ॥ చాలఁగఁ జేసి నట్టిపరి
చర్యయు సర్వము బూదిలోహావి ।

జ్ఞాలముఁబోసి నట్లు విర
సమ్మయి పోయెను [illegible] రోగిపట్టునన్ ।
ద్దైలపురాశి యంతయు గ
తంబగుఁబిమ్మట వత్తిమాత్రమే ।
వ్రేలునఁద్రోయు చుండు నెడ
వెల్గుచునుండు నె దీపమెప్పుడున్ ॥ 21

ఉ॥ పండితుఁడయ్యు రాముఁడా లోక
ప్రాకృతు భంగిని, ప్రాణవాయువే ।
యుండనికట్టెఁ బట్టుకొని
హోరున నేడ్చెను; దండ్రిచావఁగా ।
మొండరికైన దుఃఖమొక
పొంగుగ బైటికి బాఱకుండదె ।
వ్వాండును శుష్క వాదముల
వాదిడ వచ్చు సుఖాన నిల్చుచున్ ॥ 22

ఉ॥ లోటొకయింత లేనటుల
లోకులు మెచ్చఁగ కుటుంబభార మె ।
ప్పాటుననైనఁ దండ్రి, పయి
వైచుక మోయఁగ [illegible] బాలకుండు వి ।
ద్యాటనమున్ బొనర్పనగు
నయ్యది తక్కుట నగ్రజుండు దాఁ ।
బోటయి నిల్చి జంకకయె
మోయఁగ నయ్యె గృహాధికారమున్ ॥ 23

సీ॥ పూర్వపాశ్చాత్య విద్యలఁ [illegible] బూర్ణముగను
నెఱుఁగుటను రామచంద్రుండ [illegible] హీనమైన ।

యాశయమ్ముల రాశినై యలరితొల్లి
నున్నతా దర్శములనెంచి యుబ్బుచుండు ॥ 24

మ॥ ధనవాంఛన్ దొలఁగించి మానవతతిన్
ధర్మప్రధానమ్ములౌ ।
ఘనమార్గమ్ములఁ ద్రిప్పఁబోదునని సం
కల్పించుఁ దోడ్తో మనసా ।
యనశాస్త్రమ్ముల నవ్యశోధనలఁ జే
యంబూను లేదేని యే ।
పనినైనం దగు దానిఁ జేతుననుచర్యన్
బాటించు రాముండెపన్ ॥ 25

మ॥ నవశాఖాయుతమై లసత్కుసుమ
సంతానాతి సంశోభినై ।
దవవహ్నిప్రతిమైక గ్రీష్మరవి పా
దప్లుష్ట పాంథాళికు ।
ద్భవమౌ బాధ హరించు నిచ్ఛ దిశలన్
వ్యాపించు వృక్షేంద్రమున్ ।
పవి దగ్ధంబొనరించు రీతిని హఠా
త్ప్రాప్తమ్ము నౌతంద్రిమౌ ।
త్యవు. ధ్వంసమ్మొనరించె రాముహృదయో
ద్భూతమ్ము లానాశలఁ ॥ 26

ఉ॥ తిండికిసొమ్ములేదనెడు
తీవ్రపుదుఃస్థితి దాఁటు మార్గమేఁ ।
కండు గనుం గొనన్వలెను
గన్గొనకుండినఁ దల్లిదమ్ములే ।

యండనుఁ జేరఁ బోదురు, గృ
హాధిపుఁడాదిగ రాజరాజసూ ।
ర్త్రాండులుగూడ భక్తికయి
యాస్థపహింపక యుండ నేర్తురే ॥ 27

గీ॥ గౌరవాపాదియగుచు బెం § పారునట్టి
పెద్దయుద్యోగమొండుల § భింపనతఁడు ।
బట్టలను వేసి ఉవ్వులుగా § ఁబాగఁజుట్టి ।
యనుదినమ్మును నాఫీసు § కరుగుచుండె ॥ 28

చ॥ పనులను జక్కఁ బెట్టుకొను
వాంఛను వచ్చిన వారలందఱున్ ।
ఘనమగు భక్తి దోఁపఁదమ
కాయమువంచి నమస్కరించి, యా ।
తనిఁదమయంత స్తోత్రములు
దారతిఁజల్పఁగ నద్దియేరుచిం ।
చెనుదొలుతన్ గ్రమానసటఁ
జేకురువ్యాజము దోఁచెవానికిన్ ॥ 29

చ॥ పలువురు చెంతఁ జేరిపలు
భంగుల నింద్రుఁడ వీవటంచు వేఁ ।
బలికెడు పల్కులన్నియును
వానికి ముల్కులుగాఁ దొడంగె, వానిపై ।
వెలయు ప్రభుల్ పొనర్చునవి
వేకములన్నియుఁదోఁచి తన్మనో ।
జలజమునందు శల్యముల
చాయనుజొచ్చుచు వచ్చె నయ్యెడన్ ॥ 30

ఉ॥ మానవజాతికిన్ సహజ
మైదగుహక్కులం ద్రోసి స్వచ్ఛగా ।
మానసకందమందుఁ బొడ
మందగునార్జవ సత్ప్రరోహసం ।
తానములన్ బెకల్చి నిజ
ధర్మముఁజూపెడు భావజాలమున్ ।
బూనిక శృంఖలావళినిఁ
బూర్తిగఁ గట్టును బారతంత్ర్యముల్ ॥ 31

శా॥ ఏకాలంబుననేని యొక్కరణినే
నెవ్వండుగూడన్ జనాం ।
గీకార్యంబని బల్కలేని యతిదు
ష్కృత్యంబులన్ నిత్యమా ।
త్మైక స్ఫూర్తిని బై దొరల్ సలుపఁగాఁ
గన్నారనీక్షించి యు ।
న్నైకృత్యంబునుఁ జేయలేని యధముల్
హీనుల్ సదా సేవకుల్ ॥ 32

ఉ॥ స్వేచ్ఛయటంచు మానవుఁడు
చేతఁకు మిక్కిలి పల్కుచుండు నా ।
తుచ్ఛుఁడై స్వీయకార్యఫల
ధూర్వహుఁడై నిజ మానసోల్లసత్ ।
స్వచ్ఛములైన ధర్మములఁ
బాఱఁగఁదోలును బై నిబల్కునీ ।
యచ్ఛపు ధర్మసూత్రతతి
యన్యనిమిత్తము గాదె చూడఁగన్ ॥ 33

మ॥ మలినవ్యాపృతి దుష్ప్రపంచనటనా
 మాధ్యంబుతో నుండి, కా
వ్యలసత్పాత్రగితోన్నతాశయములన్
 భావించి నైర్మల్యపున్
నిలయంబేయనవచ్చు బాలకుడు, దు
 ర్నీతుల్ స్వలాభాతురుల్
గలలోకంబును గాంచి తుష్టిచెడి, దుః
 ఖంబందుటల్ వింతయే ॥ 34

ఉ॥ సేవకులందుఁ గన్పడెడు
 చేష్టలఁదక్కిన వారి నీచపున్
భావములన్ గ్రహించుచుఁ, బ్ర
 పంచవిధానము నందు నెల్లెడన్
దావలమైన దంభమును
 దప్పక గాంచుచుఁ దుష్టియంతయున్
బోవఁగ శాంతికై సెలవుఁ
 బొందియె లేనియుఁ బోవ నెంచుచో ॥ 35

మ॥ కవిసంఘంబుల నాల్కలెత్తరుణమున్
 గానంబు గావింపఁగా
నవజీవంబున దేశసేవకులహృ
 న్నాళీక సద్మంబులం
దు విశేషంబు ప్రతిధ్వనుల్ సలుపు హిం
 దూదేశ చారిత్రమా
యువకుండప్డు స్మరించెనున్నతినిధు
 లూన్! దేశ చారిత్రముల్ ॥ 36

సీ॥ పెన్మిటిఁగోల్పోయి విలపించు చూలాలిఁ *
బెంచిరక్షించిన విష్ణుభట్టు ।
బాలుఁడై నిజబాహు బలముచే నిజరాజ్య
ప్రాప్తిఁగను విష్ణు వర్ధనుండు ।
తగురీతిధర్మంబు స్థాపింపరాజ్యమ్ముఁ
బెంచిన పోలయ వేమరెడ్డి ।
కత్తియు గంటమ్ము గఱగఱఁద్రిప్పుచు
ధీరుఁడై యొప్పారు తిక్కమంత్రి ॥

గీ॥ రక్తవార్ధిఁదోఁగఁగ రక్తులగుచు
వెలసియున్నట్టి పల్నాటి వీరవరులు ।
కూడియొకసారి రామప్ప తుక్కహారమందు ।
పాడమఁజొచ్చిరి దేహమ్ము పులకరింప ॥ 37

సీ॥ మితిలేని చతురంగ తతితోడ రాజ్యమ్ము
గావించు శ్రీశాత కర్ణిఘనత । †
తెలుగువారలరక్త ములలోన నిండారఁ
దీంద్రించు నలకాక తీయగరిమ ।
పావన గౌతమీ వారిలో లీనమై
నటియించు చాళుక్య నాగరకత ।
కొండలకుద్దియై మెండారు చోడుల
ధీరత్వమును నాత్మ గౌరవమ్ము ॥

---

* ఇతఁడు రాజమహేంద్ర వరపు రాజుల మూలపురుషుని తల్లిని రక్షించెను. చూ॥ ఆంధ్రకవుల చరిత్రము క॥ వీరేశలింగము.

† పూర్వకాలమున నాంధ్రరాజులు ధరించు బిరుదనామము.

గీ॥ పూర్వపాశ్చాత్య పండిత ౹ పూజనీయ
సరసవిజ్ఞాన వైభవ ౹ స్థానమైన ।
విజయనగరంపుఁ బెంపును ౹ వింతరూపు
గలిగి కనుపట్టె మనరాము ౹ కన్నుఁగవకు ॥ 38

మ॥ ధనముల్ గోరక స్వీయసౌఖ్యములఁ గ్రిం
దన్ వైచి స్వార్థమ్మునాఁ ।
జనునామమ్మును నేనెఱుంగక యె దే
శస్వాస్థ్యముల్ గోరి భో
రనరక్తౌఘముఁ బోయు వీరజనతా
ఖ్యాతాభిధానంబు లె ।
వ్వనిహృల్లోకము సంచలింప నొనరిం
పన్ లేవు రో యోచించినన్ ॥ 39

చ॥ దినము మనంబు శల్యముల
తీరునఁ జొచ్చి ౹ వ్రణంబు సల్పుచున్ ।
ఘనతరభావ పల్లవ ప్ర
కాండము నూడ్చు ప్రపంచ వృత్తులన్
గనుఁగొని తీవ్ర వేదనలఁ
గాంచెడు వారికి ; స్వార్థదూరులై ।
చనిన మహాప్రభావుల య
శస్సృతు లెప్డు సుధాప్రపూర్ణముల్ ॥ 40

ఉ॥ మానసమొక్క సంకటము
మాటున సంశయ మన్నడోలలోఁ ।
బూనికి దక్క యూఁగుతఱిఁ
బుణ్యమొ పాపమొ చేయకుండఁగాఁ ।

గానితఱిఁ మహాత్ము లప్ర
కారముల౯ మదిఁగూర్చి సత్క్రియా।
ధీనులఁ జేయవే ప్రజల,
ధీరజనాళుల సచ్చరిత్రముల్ ॥ 41

చ॥ శ్రవణ గుహా ప్రవేశమునఁ
జయ్యన లోనికిఁ జొచ్చి దేహము।
న్నవశ మొనర్చు వీరుల మ
హాకృతి జెప్పెడు పల్కులన్న ; వా।
రవిరతము౯ వసించి హృద
యాంతర యాతన లోర్చినట్టి త।
ద్భవన విశీర్ణ కుడ్యముల
పావనతల్ గన నెట్టులుందునో ॥ 42

సీ॥ శీర్ణమై నామావ ॰ శిష్టమై గనుపట్టు
వేంగిదేశపు మహా ॰ విలసనములు।
నిలువెల్లఁబడిపోవ ॰ నేలకు మట్టమా
నగరికటకపుటా ॰ న్నత్యనిధులు।
మాతృసందేశమ్ము ॰ మానక గీర్తించి
వినుపించు నలకొండ ॰ వీటిగిరిమ।
కాకతీయుల నెత్రు ॰ కాల్వలింకినచోటు
వారక పలికెడు ॰ ధీరచరిత ॥

గీ॥ వినినఁ జూచిన నెటువంటి ॰ విమతికైన
తాపసంతోష సద్గర్వ ॰ ధైర్యగతులఁ
బులకరింపదె దేహమ్ము ॰ చలువగాలి
దవిలిపూచిన నీపపా ॰ దపము వోలె ॥ 43

మ॥ మనరాముండు దినమ్ము నాతాను
        బొనరింప న్వచ్చు గార్యమ్ము నెల్లన్ ।
మన మొక్కింతయు నిల్పజాలకి స్వధ
        ర్మత్యాగులౌ పైప్రభుల్ ।
దను నీర్ష్యన్ బరికింపఁగాఁ దెలిసి త
        త్తాపంబు వారింపఁగా ।
ఘన చారిత్రక శీర్ణ పట్టణములన్
        గాంచంగ నూహించుచున్ ॥ 44

సీ॥ పరమభావంబున § బౌద్ధులునిల్పిన
        స్తూపముల్ గన్నెళ్లఁ § జూచియుంటి ।
రాజనరేంద్రుని § వ్రాలినదుర్గంపు
        స్థితిఁజూచిహృదయము § ద్వేగమందె ।
అలవిజాపురమునఁ § గలకట్టడమ్ములఁ
        గన్నులకింపుగాఁ § గాంచియుంటి ।
గుండెల్బగాలన § నిండారఁగాఁచితి
        దుర్భేద్యమౌ మొగల్ § తుఱ్ఱుకోట ॥

గీ॥ ప్రథితసామ్రాజ్య వైభవ § ప్రాభవమ్ము
నీడులేనట్టికళలందుఁ § బ్రౌఢతనము ।
సర్వమునుగూడి ధూళిలోఁ § జొగియుండు
విజయనగరంపు దిబ్బల § వింత వగపు
క్రోధమును గల్గఁదిరుగంగఁ § గోరువాఁడ ॥ 45

గీ॥ అనుచు రాముండులోఁదల్చి § యన్నదమ్ము
లందఱను వీడి తల్లికి § నద్దిదెల్పి ।

తనప్రయాణమ్ము సలిపెడి ది తలఁపుతోడ
బయలుదేఱెను సేవన ది భరముఁదాలఁగి ॥ 46

మ॥ జనసంకీర్ణము, సంకులారవము, ను
త్సాహప్రపూర్ణంబు,నూ।
తనవస్తుక్రయ విక్రయావ్యాపృతమనో
ధర్మప్రకృష్టంబుపో। *
పణవిక్లాంత జనార్థకల్పితవిశే
షాహార వస్తూత్కరం।
బును నాస్టేషనుఁజేరి చోటుగనరా
ముండెట్టులో రైలునన్ ॥ 47

సీ॥ అడుగడ్గునకునెక్కి ది విడిపోవు జనములు,
పుట్టి చచ్చెడు వారిఁ ది బోలుచుండ।
స్థలముకై జనములు ది సల్పెడు పోరాట
ధగణి జీవనప్రయ ది త్నమ్ముగాఁగ!
† నవధిఁ జేరఁగ సల్పు ది యానమ్ము గ్రహముల్ పో
నర్చు "వేగా" ప్రయా ది ణమ్ముగాఁగ।
నంతమ్ములేనట్టి ది యవనీతలమ్మె యా
కాశవైశాల్యమ్ము ది కరణిఁ దోఁప।

---

* 1. ప్రకృష్టంబు + ఉపోషణ.

† 1. ఇదియొక పెద్ద నక్షత్రము. దీనిపై పునకు గ్రహము లన్నియును మహావేగమునఁ బ్రయాణమొనరించుచుఁ బోవుచున్నవని జ్యోతిశ్శాస్త్రి సిద్ధాంతము.

గీ॥ వివిధమాన వాకీర్ణమై ౯ వెల్లురెలు
ధరణిగోళంబుఁబోలుచుఁ ౯ దఱలుచుండ।
రాముఁడందుండి తద్వేగ ౯ ప్రాభవమునఁ
గదలుచుండె నిజావధిఁ ౯ గాంచఁగోరి॥ 48

ఉ॥ కాలమహా ప్రవాహమునఁ
గాయము నాఁజనుయానపాత్ర నీ।
లీలనె పోవుచుండి తుది
లీనముగామె యనంతమైన బ్ర।
హ్మాలయ మందెయంచుఁదన
యందుఁ దలంచెను రామచంద్రుఁడా।
శైలునఁ గూరుచున్న తఱి
'శై' ఘనువేగమునన్ హృతాంగుఁడై॥ 49

చ॥ కలకలలాడు పైరులవి
కాసము, ఫానికడన్ విలాసముల్।
వెలయఁగఁ దుష్టివెల్వడఁగ
। విందుల్ఁగమ్మగ నారగించు కా।
పులపడుచుల్ పకాలనుచుఁ
బొంగుచు నవ్వెదు నవ్వులెల్ల, వీ।
నులఁబడరామ చంద్రుఁడు మ
నోహర వృత్తిని జూచుఁబ్రక్కలన్॥ 50

ఉ॥ చల్లనిపిల్ల గాలులకు
సాపగు పైర్లు తలల్ గదల్చి, సం।

ఫుల్ల హృదబ్జులైనవిరిఁ
బోఁడుల భావతరంగ మాలికా ।
వేల్లన సాహచర్యమున
బెంపువహించి చలింతు మిట్టులం ।
చెల్లరకుఁ జనాళికి వ
చించుచు, బ్రక్కపొలాల లోపలన్ ॥ 51

చ॥ ప్రకృతివధూటి యెల్లెడలఁ
బచ్చని వల్వ ధరించి స్వీయ పు ।
త్రికలగు కాపుఁగన్నియలఁ
దియ్యని యిక్షురసంబుఁ గ్రోల్చి, త ।
చ్చికుర భరంబులన్ సుమవి
శేషములం గయిసేసి వారలన్ ।
శుక పిక శారికారవము
చొప్పున లాలనసేయు నచ్చటన్ ॥ 52

ఉ॥ చద్దుల నారగించుకొని
చల్లని మామిడి గున్న నీడలో ।
నద్దపు బిళ్ల వ్రేలెసాబ
గందెడునేతపునేల నూతిపై ।
న్నిద్దపు టొడ్డునన్ గలసి
నిల్చుచు, నొప్పుల కుప్పలాడఁగా ।
నుద్దులుగట్టి సిద్ధముగ
నుండిరి కాపుల కోడెకన్నియల్ ॥ 53

మ॥ పసులన్ బీళ్లను మేఁతకై విడి వట
ప్రచ్ఛాయఁ జల్దన్నముల్ ।

పస మీఱంగ భుజించి చేతులనుఁ బి
ల్లంగ్రోవివై నూఁది సం।
తసముప్పొంగ నొకండు పాడుకొనఁగా
దద్వృక్ష శాఖాళులన్ ।
గొనలన్ గోపకు లాడు చుండిరట జం
తుల్లేక క్రొమ్మెచ్చులన్ ॥ 54

ఉ॥ పచ్చని పచ్చికల్ మెసవి
ప్రక్కనెయున్న జలాశయమ్ములో ।
నిచ్చకు వచ్చినట్లు జల
మింపు గఁ గ్రోలఁగ నొవ్వులేగ వే ।
గోచ్ఛలితమ్ములై హరిణ
యూథము పోలిక లేఁగదూడలున్ ।
మచ్చిక మీఱ " బే " యనుచు
మాతల బిల్చుచునంటె వెంటనే ॥ 55

ఉ॥ దూడల యార్పులన్ వినుట
దూరము బోవఁగ నించుకైనఁ గా
లాడక యాలు నిల్వఁదమ
యమ్మల చెంతకె దూడ లెల్ల దా ।
ట్లాడుచుఁ బోవఁగానవియు
నన్నియు దప్పి దొఱంగి, నాల్కలన్ ।
దూడల నాకు చుంటగను
దోయిని గాంచెను రాముఁడత్తఱిన్ ॥ 56

ఉ॥ మింట సహస్ర దీప్తి మితి
మీఱివెలుంగుచు నున్నఁగూడ, నా ।

పంటపొలాల మేరలకు
వాటముగా జలమెత్తగూడలన్ ।
గెంటుచునెండ వెన్నెలల
కించుక భేద మెఱుంగనట్టి యా ।
పంటలకాఁపులు రుద్దులకుఁ
బైఁదమ గూడల నిల్పి రైలుఁగ ॥
న్గొంట గ్రహించి రాముఁడిటు
గొంచెము యోచన సల్పెలోపలన్ ॥ 57
మ॥ అవురా! యేమిది! యెచ్చటన్ గనిన న
త్యానందమున్ దృష్టియున్ ।
వివిధవ్యక్తులయందు గొండ్లి సలుపున్
వింతన్యోడిన్ జూడఁగా ।
రవిబింబంబుననుండి వెల్వడెడు
నీ రంధ్రాంశువుల్ గూడఁ గా ।
లువ నీటంబడియాడు సమ్మదమహా
లోలత్వముం జూపుచున్ ॥ 58
ఉ॥ తూరుపు దిక్కునన్ దరణి
తోఁచిన దాదిగ నాతఁడంబుధిన్ ।
జాఱెడు నంత దాఁక నొక
సారియు గూడను విశ్రమింపకే ।
తీతునఁ గళ్లమందుఁ బని
దీర్చుచు, జీవన మెల్లఁదుష్టి కా ।
గారముగాఁగఁ బుచ్చెదరు
కాలము నెల్లరు శాలి పాలకుల్ ॥ 59

చ॥ కనకమయంపు నాభరణ
కాండములన్ ధరియించి, వజ్రపున్ ।
దునుకల రాళ్లతోడఁదులఁ
దూఁగఁగఁ జాలినయన్ని దాల్చి, 'ఓ' ।
యనన దె సన్నగాఁగొని, జ
నావళిసేవలుసేయ మేడలం ।
దున నివసించు వారలకు
నుండు నె వీరల తుష్టిసౌఖ్యముల్ ॥ 60

చ॥ నలుగురలోనఁ బెద్దదగు
నామముఁదాల్పఁగ నన్య జీవనం ।
బులనధి కారమేవిధిని
బొందగఁజాలుదు మంచు యత్నముల్ ।
సలుపుచు నీర్ష్యలన్ బడి స్వ
శక్తిని సర్వము నీచకార్యసం ।
వళిత మొనర్చుచుండు ధన
వంతులకింతటి సౌఖ్యమబ్బునే ॥ 61

ఉ॥ పట్టణజీవనంబు సుడి
వంటిది యూనుడిగుండ మెప్డు, దాఁ ।
బట్టినవాని వీడదొక
పాటి తటస్థుఁడు గ్గైనేని, వాఁ ।
డెట్టులనైన మధ్యమున
కీడ్వఁబడున్ గద శాంతి దూరులౌ ।
కట్టిఁడి కత్కవార్ల కరి
గాపులు పట్టణవాసు లందఱున్ ॥ 62

మ॥ మనుజవ్రాతము లోఁ గనంబడెడు దు
ర్మార్గంబులన్ స్వీయ పో।
షణకై యన్యుల నీడలై నడచుచున్
స్వాతంత్ర్యమున్ వీడి, జీ।
వనమున్ వ్యర్థము సేయు హీనపురుష
ప్రాంతంబె వ్రాకుండఁబా।
వనమైనట్టి యమాయికత్వ మలరన్
వర్తింపరే కర్షకుల్ ॥ 63

చ॥ ఒడలొకతుప్పు వట్టి తుది
నొందకయుండఁగ, సృష్టికర్త ప్రే।
ముడినిడినట్టి మందనఁగఁ
బోలు శరీరపరిశ్రమంబు పో।
విడిచి, పరార్థ మెప్పుడును
బీల్చుచు జీవనయాత్రసల్పుచుం।
డెడు గడుసోమరుల్ సుఖము
నెన్నఁడు, గాంచఁగ నేర్తురేయిలన్ ॥ 64

చ॥ చదువులునేర్చు పండితులు
సత్యముగన్గొనఁ గార్యకారణా।
స్పదములె మైనవాదములఁ
బల్కుచుశంకల మున్గుచంద్రు,త।
ద్గదితములైన సంశయపు
దారులెఱుంగక యజ్ఞులొచుఁ బో।
యెదరుకృషీ వలుల్, మనకు
నెచ్చటనక్షత తృప్తిమూలమై।

పొదలునొ యచ్చటఁ దెలివిఁ
బొందఁగఁగోరుట దుఃఖహేతువే ॥ 65

చ॥ అనుచు ననేకభంగులన
యత్నతఁ బార్శ్వములందు నత్తఱిన్ ।
గనులకుఁదోఁచు వస్తువులఁ
గాంచుచు; రాముఁడు పోవుచుండఁగా ।
నినుఁడపరాబ్ధిఁ గ్రుంకె, నొక
యించుకజంకక రైలుగూడ, వే ।
యినుపపథంబు నందుఁబడి
యేగుచునుండె నిజావధిన్ గనన్ ॥ 66

చ॥ ఇనుఁడపరాబ్ధిఁ గ్రుంగ నొక
యించుకసంతస ముండ లేదు, రా ।
మునకిరుప్రక్కలందుఁ గడు
మోదముతోఁ గనుపట్టువస్తువుల్ ।
ఘనతిమిరైక గుప్తమయి
కన్నులఁ బట్టక పోయెదృష్టియున్ ।
దనవసియించు నట్టిగది
దాటి యెఱుంగదు, రాత్రియంతయున్ ॥ 67

ఉ॥ మేఁకలఁదొడ్డిలోవిడిచి
మేకుబిగించిన యట్లు కోళ్లపెన్ ।
మూఁకలగూఁటఁ ద్రోసిపయి
మూసినయట్టులు, పాంథులెల్లరున్ ।
మూఁకలుగాఁగఁద్రోయఁబడి
మూఁడవక్లాసునఁ గూరుచుండమై ।

సోఁకఁగగాలి రాకకును
చోటులభింపఁగ లేదువానికిన్ ॥ 68

చ॥ తెలుపొకయింత దూరుపునఁ
దీరినవేళకు నంధకారముల్ ।
విలవిల వీడిపోవఁదన
పెట్టెనురాతిరి గూరుచున్నవా ।
కలునుదొలంగి పోవ మన
రాముఁడెడక్కి, తుపాను పెట్టెవే ।
వెలసినరీతి; వానికిని
వీలులభించెను విశ్రమింపఁగా ॥ 69

మ॥ నలుప్రక్కల్ పరికించినన్ పసరువ
ర్ణంబేమియున్ గంటితో ।
జెలిమింజేయదు; మూర్ఖమానవునిహృ
త్సీమాతిశూన్యత్వమున్ ।
ఖలుకాఠిన్యము, సజ్జనప్రవరుసం
కల్పైక వైశాల్యమున్ ।
గలదై తోఁచెను రామచంద్రునకు మా
ర్గంబందు నేలెల్లడన్ ॥ 70

ఉ॥ ఆవిధికొన్ని గంటలుప్ర
యాణమొనర్పఁగఁ బ్రక్కబైలులో ।
గ్రీవమువెత్తి వీనులను
టిక్కఁగఁజేసి మనోహరంబుస్వా ।
భావికచంచలంబునయి
భాసిలుదృష్టిని నిల్పి,భీతియున్ ।

బోవఁగరైలుఁ గాంచుమృగ
పోతములన్ గనె రాముఁ డత్తఱిన్ ॥ 71

చ॥ బెదరుఁదొలంగి యేణముల
భిన్నగతిన్ రథనేమిరావమున్ ।
మదినసహించుఁ గణ్వముని
నాథునియాశ్రమ సీమనంచు,మున్ ।
చదివినకాళి దాసుని ర
సస్ఫురణమ్మగు వర్ణనల్ వడిన్ ।
హృదయగతమ్ములయ్యెనుగ
వీంద్రునివాక్యముశాశ్వతమ్మగా ॥ 72

ఉ॥ ఎక్కడికాళి దాసుఁడత
డెప్పుడువ్రాసె శకుంతలాకథా ।
ఫక్కిని; గణ్వుఁడె త్తఱినివర్ధిలె;
నెన్నిశతాబ్ద పంక్తులన్ ।
దక్కకదూఱి పోయెను క్ష
ణంబున రాముని భావశక్తి, యిం ।
కెక్కడిదవ్వు గల్గును, క
వీంద్రులశాశ్వత చిత్రముండినన్ ॥ 73

చ॥ అనయము సు ప్రభాతముల
యానిలపోత ప్రబోధితాత్ముఁడై ।
తనువొకసారి పొంగ సిక
తాస్థలిఁదావిహరించువాహినీ ।
శునిపదపంక్తి చిహ్నముల
చొప్పుననస్థిర మైనమర్త్య్యజీ

వనచరితమ్ములన్ స్థిరత
పాల్పడఁ జేయరె సత్కవీశ్వరుల్ ॥ 74

చ॥ ఉదయమరీచికావికసి
తోద్ఘనుమమ్ముల వాసనాళులన్ ।
బదిలమొనర్చి యుత్తరును
బంచియొసంగెడు సాహెబట్లు,స ।
ద్హృదయవికాసమొప్పఁ బొన
రించెడుఁ జీవన పుష్పవాసనా ।
సదమలసారమున్ జవి యొ
సంగుచుమోదముఁ గొల్పరే కవుల్ ॥ 75

చ॥ తళతళలాడి తారల ప
థంబుననద్భుత మారయమ్మునన్ ।
వెలుఁగుతటిత్తు నాహృదయ
వీధిఁదటాలునఁ బాఱుచుండునూ ।
హాలరచియింత్రు భావిపురు
షాళికిఁ దెల్పెడు నిచ్ఛకామెరా ।
బలమునఁబాఱు నాకృతులఁ
బట్టెడు లేఖకులో యనన్ గవుల్ ॥ 76

మ॥ కవిరాణ్మండల సార్వభౌమురచనల్
జ్ఞానమ్ము పక్వమ్ముగా ।
ని వయఃకాలమునందు బాలకులచే
నిత్యంబు వల్లించుటన్ ।
జవిచచ్చున్ మఱి కాళిదాసన సదృ
ష్టంబొప్ప, రాముండు త ।

త్కవిసంకల్పితకావ్య రాజముల సం
తల్ నేర్వఁ డారీతిగాన్ ॥ 77

ఉ॥ రైతులు కాలమందిడిన
ప్రత్తిపొలాలనుఁ, జొచ్చియాకులన్ ।
మేఁతగ మేసి యెచ్చటనొ
నీరముద్రావి మహేశ్వరప్రభా ।
జాతవిశాల భూస్థలినిఁ
జల్లగనిద్ర యొనర్చి పాతక ।
వ్రాత మెఱుంగ కుదెడుకు
రంగము లెంతటి ధన్యముల్ గదా ॥ 78

మ॥ తనతోఁ బుట్టి సమంపు హక్కుగలమ
ర్త్యశ్రేణినే రీతినై ।
నను స్వీయప్రభకున్ వశీకృతులుగా
నాట్యమ్ము సేయించు, దు ।
ర్జన సాంగత్య మెఱుంగకుండ నెపుడున్
సంతుష్టికిన్ దావులై ।
జనఁగా నేర్చిన యేణరాజములహా !
సత్యంబు గా ధన్యముల్ ॥ 79

ఉ॥ ప్రక్కలఁ దోఁచు వస్తువులు
భావములో మొలపించు నూహలన్ ।
దక్కక సంతసించుచు, వృ
థాయిటు లయ్యెనటంచు నేడ్చుచున్ ।
పెక్కువిధంబులన్ దలఁపు
వెళ్లఁగ నాతఁడు పోవుచుండెఁ, దా ।

నెక్కినరైలు స్వీయగతి
నించుకదప్పక యేగుచుండఁగా ॥ 80

మ॥ మనమారీతిఁ జెలంగుచుండ శకటం
బాబైళ్లపైఁ బోయి కా।
ననసీమం జొరఁబాఱి, యెత్తయిన కొం
డల్ వేగ లంఘించుచున్ ।
జనఁగాఁ జొచ్చె క్షుధార్తమైకనలి గ
ర్జారావ ఘోరాకృతిన్ ।
వనసత్వమ్ములకై చరించెడు మహా
పంచాననంబోయనన్ ॥ 81

ఉ॥ ఉన్నత పర్వతాగ్రముల
నుండి యధోముఖమై, మహోగ్రమౌ ।
పన్నగమేగు దెంచుగతి
వంకరమార్గముఁ బట్టి ముందును ।
త్పన్నము నైన బుస్సనెడు
ధ్వానముతో శకటమ్ము వేగ ని ।
మ్నోన్నత భాగముల్ గడచి
పోవఁగ నచ్చెరు వయ్యె వానికిన్ ॥ 82

మ॥ ఇరుపార్శ్వంబుల శైలుమార్గమున నె
న్నేనున్న తంబైన భూ ।
మిరుహాంబుల్ దిలకించి ముక్చనిన భూ
మిన్ జెట్టు లే కుంటక ।
బ్బురముం జెందుచుఁ "దేటతెల్లైలకు దే
వుం డెప్డు వేర్వేఱుచో ।

నిరవుల్ గూర్చుట సత్య"మంచు మదిరో
చింపండె రాముండటన్ ॥ 83

చ॥ సిరియు గుణంబులుం గలిగి
చెన్నెసలారెడు వానికే భువిన్ ।
మఱియొక యింత యిత్తఱిను
మంతయు లేక దరిద్రుఁడై సదా ।
పరిపరి రీతులం బొగులు
వానికిఁ గొంచెము నెవ్వ రీయరా ।
వరుసనె దేవుఁడున్ భువిని
వర్ధిలఁ జేయును న్యూనతోన్నతుల్ ॥ 84

మ॥ కనులన్ మీఁదికి నెత్తి జాలముల మా
ర్గంబందు వీక్షింపఁగా ।
గొనయొక్కింతయుఁ దోఁపదాతరు శిఖల్,
క్రోధాతి రేకంబుచే ।
నినుత్రోవం జననా ప్రభంజనుని తో
హింయంచు సయ్యాటలా ।
డును నత్యున్నత గోత్ర జాతులకునుం
డున్ గాదె యౌన్నత్యముల్ ॥ 85

ఉ॥ గ్రావమునుండి గ్రావశిఖ
రమ్మున కేగెడుపట్లఁ బర్వత ;
స్రావకృతాతినిమ్నఝర
సంతతి నెల్లను లీలఁదాఁటుచున్ ।
బోవుచునున్న రైలురయ
మున్ గనుఁగొంచు మనమ్ములోనఁ డా ।

నీవిధి రామచంద్రుఁడువ
చించుకొనెన్ దదధీనచిత్తుఁడై ॥ 86

మ॥ పయిఁగూర్చుండి యధోముఖంబు దిలకిం
పన్ దృష్టి గిఱ్ఱుంచుఁ గ్రిం।
దయి పోవందగు నట్టి లోతుగల కో
నల్ లీల గాఁగట్టి యా।
పయి నైలున్నడి పింపఁగాఁ దలఁచు భా
వంబెంత శ్లాఘ్యంబు; నీ।
రయిపోవే శిలలున్ మహా మతుల కా
ర్యస్థైర్యధైర్యంబులన్ ॥ 87

మ॥ నవకాలమ్ము మనుష్యజీవన విధా
నమ్మందు నెంతేని మా।
ర్పు నొసంగించె నత ప్రమాంసతతులన్
ముక్కల్ బొనర్పంగ, వ।
శ్నవికారమ్మగు నాయుధమ్మె గతియై।
చన్నట్టి కాలానకున్।
వివిధోపాయసుఖాలవాలమన నా
నీ నాఁటికిన్ సాటియే ॥ 88

ఉ॥ దైనిక కార్యముల్ గొను వి
ధానమునందు మృగమ్ము మాత్రమే।
మానవసేనకున్ గరణ
మై పొలుపందిన యాయుగానకున్।
గానఁగరాని యావిరి క
ణమ్ములల సందులఁ డాఁగియున్నదా।

మానవిదూరశక్తి పర
మాద్భుత కార్యములెల్ల భృత్యమా ॥
గ్గాన నొనర్చు చుండఁదగు
ప్రస్తుత కాలముతోడ సాటియే ॥ 89

చ॥ ప్రకృతి విధానమెల్లఁ దగు
పద్ధతితోడఁ బరీక్షఁజేసి భౌ ।
తికమగు శక్తి నిష్టమగు
తెన్నునఁ బుచ్చుచు లోంగఁదీసి, సే ।
వకు గతిఁబంపుచుంట బహు
వన్య మృగంబులఁ బట్టి వానిచే ।
సకలము సల్పఁజేయఁ గల
సర్కసు వంటిది గాదె చూడఁగన్ ॥ 90

ఉ॥ జ్ఞానము మానవాళికొక
శక్తి, యనంతమునైన దానిచే
మానవుఁడా చరించుపర
మాద్భుతమా కృతి కడ్డుగల్గద ।
వ్వానికి సార్వభౌమపద
ప్రాప్తిల భించెఁ జగంబుపైనిన ।
ద్దానసె; యీశ్వరుండు వసు
ధన్ మనుజున్ సృజియించె నాత్మనా ।
మ్మ్యాననటంచు బైబిలున
నాడిన పల్కున కిద్ది హేతువౌ ॥ 91

ఉ॥ ఎత్తగు పర్వతమ్ము పయి
నెక్కఁగ పిల్లలు గంగ లేనిచో ।

నుత్తమ మంచు నాదిగువ
నొక్కసారంగముఁ గట్టునూహ నీ।
కెత్తరుణంబునన్ గలిగె
నించుక దెల్పుమ! నేలఁ ద్రోల్చుమ।
న్నెత్తిన కొక్కు నీకు వచి
యించిన పద్ధతిగాదె! మానవా॥ 92

చ॥ జేల జేలఁబాలు వాహినుల
శాస్త్రచయమ్ము ననంతమౌ మహా।
పలసముదాయమందు హిత
వాక్యసమాజము, మంచియెల్లెడన్।
వెలయు నటంచుఁ బూర్వము క
వీంద్రుఁడు షేక్స్పియరాడి యున్నయా।
పలుకులొకప్పు డైనను న
బద్ధములౌనె తలంచి చూడఁగన్॥ 93

చ॥ ప్రకృతివిశాల పుస్తక వి
భాసిత పత్రలసద్వివేకముల్!
సకలమునేర్చు జాణలక
సాధ్యములుండు నొకో! జగన్నియా।
మకుఁడగు నీశ్వరుండు నిజ
మార్గము మానవ శిష్యపాళికిన్।
ప్రకటము సేయఁ గూర్చిచిన
గ్రంథముగాదొకొ, సృష్టి యంతయున్॥ 94

సీ॥ నాయికా నాయక నామక భేదముల్
దినచర్యలందుఁ గనన్గొనరెజనులు।

పంచమషడ్జను ♪ స్వరముల మాధుర్య
ములఁ దెల్పు కోకిల ♪ కోకిలయు నెమిలి।
సంయోగసమవాయ ♪ సంబంధములు పెక్కు
కాంచరే యెల్లరుఁ ♪ గన్నులార।
బ్రహ్మసత్యమటంచుఁ ♪ బలుకఁగాఁ గల్గుట
కపట జగన్నాటకమునఁగాదె ॥

సీ॥ కవులు, గాయకుల్ తార్కిక ♪ గ్రామణులును
దత్త్వమసియంచుఁ బలికెడు ♪ తత్త్వవిదులు।
నీకుఁగల యవయవములఁ ♪ బ్రాకటముగ
స్వల్పమాత్రమె దెలుపంగఁ ♪ జాలియుంద్రు,
ప్రకృతి విద్వద్వధూటి ! నా ♪ వందనమ్ము ॥ 95

గీ॥ అటుల భావంబు లెన్నియో ♪ యలరు చుండ
యోచనల మున్గి మనరాము ♪ డుండునపుడు।
పశ్చిమాబ్ధిని సూర్యుండు ♪ వ్రాలి పోయె
నంతనార్తిలు చేరెను ♪ గుంతకల్లు ॥ 96

ఉ॥ ఆఁకలిబాధ కోరువక
యాతఁడు వేగమె పూటకూళ్లఁదాఁ।
గైకొనెసింత, తిండి మడి
గట్టుట లేదని మానఁడాయె న।
ఆఁకటిచేత బాధపడు
నప్పుడు నీమడిలేమి యడ్డునే।
భీకరమృత్యుకాలమున
వేఁడు స్మరించును, సాంధ్యకృత్యముల్ ॥ 97

సీ॥ నటనకాలమునందుఁ † జటచట నరుదెంచు,
పాత్రలో యనవచ్చు † పాంథులమర।
ప్లాటుఫారముకడఁ † బార్శ్వములందును
నిలిచెడు రైల్లు సీ † నులునుఁ గాఁగ।
బారునన్పొవ్వారు † ప్లాటుఫారమె నట
కులకుగలుగురంగ † తెలముగాఁగ।
స్టేషనుమాస్టరే † చెలువారు దృశ్యమ్ము
రూపించు సూత్రధా † రుండుగాఁగఁ॥ 98

గీ॥ ప్రకటముగ నాడురైలునా † టకముదప్ప
వారకయె వీచు దట్టంపు † వాయువులును।
దప్ప, నాపురంబున నేమి † యొప్పుచుండు।
సంతతము శూన్యతకునిల్లు † గుంతకల్లు॥ 99

గీ॥ రాముఁడచ్చోట నిలువక † రాత్రియందె
పయన మొనరించి హాొసపేట † వఱకు నేగి।
శీఘ్రముగబండి పైనెక్కి † చేరుకొనియె
వివిధరాజన్యవాసమై † వెలిగియుండె।
పెద్దదిబ్బల నిపుడొప్పు † విజయపురము॥ 100

ప్ర థ మా శ్వా స ము.

స ం పూ ర్ణ ము.



# రామచంద్రుని హంపీయాత్ర.

## ద్వితీయాశ్వాసము.

---

సీ॥ ఏకోట లక్షలు ఽ హృదయముల్ దమన్యాన
తలఁదల్చి భక్తితో ఽ నలరు నెచట।
రాజరాజులుదమ ఽ రాజత్వముఁ దొఱంగి
సాష్టాంగ వినతులు ఽ సల్పిరెచట।
కాలమూషకదంష్ట్ర ఽ పాలిటఁబడిపోక
శాశ్వతమైనిల్వఁ ఽ జాలెనెచటు।
సేతుశీతమహీధ్ర ఽ సీమాంతమాభూమి
నీడులేని ప్రశస్తి ఽ హెచ్చెనెచటు॥

గీ॥ నిరుపమానైక వైభవ ఽ నిలయమొద్ది
సకలసౌభాగ్యసీమమై ఽ జరిగెనెచటు।
అట్టిశ్రీవిరూపాక్షుదే ఽ వాలయమ్ము
కన్నులారంగ నీనాఁడు ఽ కాంచినాఁడ॥.

చ॥ విరివివహించె మానసము
పెద్దతనమ్మునను గర్వముఁబవిం।
గొఱఁతవహించె, నీశ్వరుని
కోవెలముందఱఁ జిన్నచీమనై।
తిరుగుటతప్ప నేననెడు
తీవ్రతసర్వముఁ జచ్చిపోయె ; భా।

"అట్టి శ్రీవిరూపాక్షుదే । వాలయమ్ము ।
కన్నులారంగ నీనాఁడు । కాంచినాఁడ ॥"




36. పంపాపతి (విరూపాక్ష) దేవాలయము. { *By kind permission of* K. Nageswararao Garu.

స్వరమగు నీదు తేజమున
వర్థిలు నొక్కకణమ్ముగానొకో ॥ 2

*చ॥ కాలపరంపరాజలద
కాండతిరోహిత మూర్తిమంతమై।
క్రాలుట ఎక్కి మానవుల
కన్నులకుఁ వెలియైన యేప్రభా।
శాలిచిదంశువుల్ తొలుత
శున్యతలమందు స్థిరమ్ముగాఁగ దే।
వాలయరూపమంది, నిర
తాగత తైర్థిక భక్తజాలదృ।
గ్జాలపరంపరన్ హృదయ
సౌధముల న్వెలయించు నిచ్చటన్ ॥ 3

చ॥ తుదియు మొదల్గనుంగొనఁగఁ
దోఁపని యాకసమందు లెక్కకుఁ।
గుదురని యెన్ని రిక్కలఁగ
నుంగొన మట్టు లనంతకాల మం।
దుదయమునందుచుండరె, మ
హోన్నత ధీ నిధులెప్డు వారి దా।

---

*గతకాలమ్ముననుండిన యేప్రభాశాలినుంచి, కొన్ని వెలుఁగులు(ఊహ) వెల్వడి యిక్కడి కోవెలరూపమున ఘనీభవించి నిల్చి దృక్కులనెడు కిటికీలంజొచ్చి చూపఱ హృదయమనునట్టి సౌధమును వెలిగించుచున్నదని యర్థము. అనగా గతించినయే మహామహుని బుద్ధినుండి పొడమిన యూహ పైనీ కోవెల గట్టఁబడినది? అని ప్రశ్నించుటభావము—ఈ ప్రశ్నకు సమాధానము క్రింది పద్యములలోనున్నది.

సదమలకాంతి భూమినొక
చాయను వెల్గఁగఁ జేయుచుండదే ॥ 4

ఉ॥ నామము మాధవుండు, భువ
నైకహితవ్రతధారి, దేవతా ।
ధామము నిచ్చట న్నిలిపి
ధర్మమెఱుంగని నాస్తికాత్ములా ।
పామరమానవాళిఁ గ్రమ
పద్ధతిఁ ద్రిప్పఁగ నెంచె నందురా ।
ధీమహితుండెవండొ మదిఁ
దేటగఁ దోఁపకయున్న దేలొకో ॥ 5

శా॥ విద్యారణ్యుఁడె! మాధవుండు! స్వకుటుం
బిత్వంబుఁ బోఁద్రోసి, స ।
ర్వోద్యోగమ్ము జగత్కుటుంబతియు, త్యా
గోద్వృత్తి పైఁదాల్చి, స ।
ద్విద్యాదాన మొనర్ప, దండమును చే*
తిం జేర్చి సన్న్యాసియై ।
విద్యారణ్యసమాఖ్యతో వెలసె నా!
వింతయ్యె విన్నంత నే ॥ 6

మ॥ తొలిమంత్రీంద్రుఁడవై మహామతిఁ బ్రభు
త్వోద్యోగముం దీర్చి, యం ।
దలి వైశాల్య విహీనతంగని నిజా
న్నత్యంబు దిక్కాల సం ।

* చేతినిఁ జేరునట్లు చేసి.

కలితాల్పత్వముల౯ ద్యజించుటకునై
గార్హస్థ్యము౯ వీడితీ।
విల నీ తేజము శాశ్వతమ్మగు విధి౯
వెల్గు౯ గదే యెల్లెడ౯॥ 7

మ॥ తొలినాబ్రహ్మముఖంబునుండి వెలికి౯
దోఁతెంచు వాగ్గుంభనల్।
తెలియం జాలక యజ్ఞతాతిమిర వీ
థింబెల్లు గోడాడు న।
తులనెల్ల౯ శ్రుతిభాష్యమూలమునఁ దే
జోవంతముల్సేయఁగా।
నిలయెల్లం జరియించుచుందువు గదా!
నిర్నిద్ర రూపమ్మున౯॥ 8

ఉ॥ భంగురమైనమాధవుని
భౌతిక మూర్తి గతించినంత లో।
నం గలయాత్మరూపము, వి
నాశమునంద దనంతగ్రంథ మూ।
ర్తింగనుపట్టి యతులల ద
రి౯ సతతంబును దాండవించు; నం।
ధ్యంగత మైన సూర్యరుచి
యగ్నివసించుచు గోచరింపదే॥ 9

ఉ॥ స్థూలశరీరదూరుఁడయి
సూక్ష్మమె నైన యశశ్శరీర మే।
యాలయమైన మాధవుని
కై యిసు మంతయుఁ జింత సేయఁగాఁ।

బోలదు ; కాంచనమ్ము శిఖిఁ
బొందుటఁ బై మలినమ్ము వీడి కాం ।
త్యాలయ మౌటచే నమల
మై కనుపట్టదె చూచువారికిన్ ॥ 10

*ఉ॥ శ్రౌతము, స్మార్తము, న్నగద
శాస్త్రము, ధర్మము, వేయునేల భూ ।
మీతల మందుఁ గల్గిన య
మేయకళల్ సకలంబుఁ జొచ్చె నీ ।
యాతతశక్తి, భూతముల
నన్నిటిఁ గన్నది యాకసంబు, త ।
జ్జాతము లౌపరాణువుల
సందులనెల్లను నిండియుండదే ॥ 11

ఉ॥ సాయణ వంశజుల్, సుగుణ
శాలులు, శ్రీమతి గర్భశుక్తిము ।
క్తాయిత మూర్తులై భవముఁ
గాంచిన మాధవ సాయణాహ్వయుల్, ।

---

* "ఆకాశాద్వాయుః వాయోరగ్నిః—" ఇత్యాదిశ్రుతి ననుసరించి భూతములైదును నాకాశమునుండే పుట్టినవి. ఇంతియగాక మాయాకాశమే, భౌతికములగు నణువులకు నడుమఁ (Intermolecular spaces) గూడనిండియున్నది. అటువలెనే మానవబుద్ధిచేఁ గల్పింపబడిన శాస్త్రము లన్నిటియందును, కళలన్నిటియందును, మాధవుని (మానవుని) బుద్ధిప్రవేశించుటయం దాశ్చర్యమేమియును లేదనిభావము.

మాయఁడు పుత్త్రవర్యులన
మంబగు తేజము తోవెలింగి బో।
ధాయనసూత్రమున్ జగము
నంతటఁగీర్తి నెసంగఁజేయరే!॥ 12

చ॥ నరులను జంతు తుల్యులుగ
నాటఁగ నేసి, పురంబు శూన్యమై।
వఱలఁగ సంతసించి, యల
పశ్చిమదేశములోని 'నీరో'* తో।
సరియగునట్టి తుగ్లకుఁ డొ
సంగు స్వతంత్రతఁదాల్చియున్న యా।
హరిహర బుక్కరాయలకు
నాప్తులుగాఁగ మెలంగి రిర్వురున్॥ 13

చ॥ శరము శరాసనమ్ముఁగొని
శ్వానములున్ వెనువెంటనంట భీ।
కరముగఁబోటు బంట్లు వెను
కన్ బఱతేరఁగ నొక్కరోజునన్।
హరిహరుఁడానెగొంది విడి
యావలి యొడ్డున వేఁటలాడఁగా।
నరిగెను దుంగభద్రనుర
యమ్మునఁదాఁటుచుఁ గౌతుకమ్మునన్॥ 14

---

* నీరోయనునతఁడు రోముదేశపు చక్రవర్తి. రోముకాలి పోవు చుండఁగా మేడపైఁ గూరుచుండి తాను ఫిడేలు వాయించుకొనుచుండెను.

చ॥ కతిపయపాదముల్ నడువఁ
గా శశమొక్కటి ప్రక్కలోఁదటి ।
ల్లతవలెఁ బాఱుచుండఁ గశ్వ
తండము దానిని వెంటనంటెఁ; ధీ ।
రతశశకంబు వెన్దిరిగి ।
రక్కసి కుక్కలకుక్కఁ జూపనె ।
క్కతమున నిట్టి యబ్బురము
గల్గెనటంచును జింత సేయుచున్ ॥ 15

చ॥ హరిహరరాయుఁడంత మృగ
యా కుతుకంబు దొఱంగి, యెంత య ।
చ్చెరువిది వేఁటకుక్కలను
జీరికిఁగైకొనకుండ మీఁదికిన్ ।
దిరుగు శశమ్ము నెప్పుడవ
నిన్ మునువింటిమె చంద్రమండలాం ।
తరమునసుండివచ్చినదొ ?
దారుణ మేమి ఘటిల్లనున్నదో ॥ 16

చ॥ అని భయమంది వేఁటను స
మాప్తమొనర్చుచు మంత్రి మాధవున్ ।
గని సకలమ్ము దెల్పిన, స
కారణమింత భయంపడంగ వ ।
ద్దని బెదరుడ్పి యుద్దిశుభ
దాయకమా శకునంబిటుల్ మహా ।
జనపద మొండు గట్టు నెడ
శాశ్వతమౌనని పల్కె నాతఁడున్ ॥ 17

సీ॥ మాధవు నానతి § మదిఁబూని హరిహర
పతిగట్టియుండిన § పట్న మేది ?
కుందేలుపాఱక § కుక్కలఁబోరాడు
శౌర్యాగ్ని యెచ్చోట § జ్వలితమయ్యె ?
సాయణాచార్యుఁడు § సహజన్ము వెనువెంట
సంచరించిన మహా § స్థానమెద్ది ?
ఏడు ప్రాకారంబు § లీడు లేకుండఁగ
నరిభీకరమ్ముగా § నలరెనెచట ?
గీ॥ సకల సామ్రాజ్యవైభవ § స్థానమగుచు
పరమపావన భావనా § వాలమగుచు ।
సరసవిజ్ఞాన సంపూర్ణ § చారునగుచు ।
వృద్ధిఁగాంచిన పట్టణం § బేదినేఁడు ॥ 18

సీ॥ కూరగాయలకును § గొఱగాక రత్నముల్
కుప్పలు తెప్పలై § యొప్పె నెచట ।
వేనవేల్ జనములు § విలుచు వేడ్కను వచ్చి
కన్నుల పండువుల్ § గాంచిరెచట ।
వివిధ దేశాయాత § విశ్రుత వర్తకుల్
బేరసారములు గా § వించిరెచట ।
భూషణమ్ములు దాల్చి § భూలోక సుందరుల్
మేడలపై నడ § యాడిరెచట ।
గీ॥ నట్టి యిండ్లను గబ్బిలా § లవతరించె ।
వెంటపోవ్రులు దప్పరే § వింతగలదు ?
కడుపుతఱుగుక పోవదె ! కాంచినంత ।
విజయనగరాన వెలసిన § విజయలక్ష్మి ! ॥ 19

సీ॥ పనిఁబూనియెచటఁ బో ఽ వనసెంచు వారిఁ
సందులేకుండిన ఽ సరణులేవి ?
ఖంగు ఖంగు మటంచు ఽ గంటలనాదముల్
రంజిల్ల నడచెడు ఽ రథములెచట ?
రోజాసుమమ్ముల ఽ బాజారులెచ్చోట ?
పుష్పలావికల సొం ఽ పులును నెచట ?
వాసనాద్రవ్యముల్ ఽ రాసులై కాటనా
రుల నాసలనుబేర్కఁ ఽ బిలిచెనెచట ?
గీ॥ నక్కకూఁతలు, పఱచెడు ఽ పక్కిగములు ।
గూదురుఁదొండలు, పందుల ఽ బురదగుమ్ము ।
తప్పనింకేమి యిండ్లలోఁ ఽ దనరుచుండు ।
విజయనగరాన వెలసిన ఽ విజయలక్ష్మి ! 20
సీ॥ నింబముల్ నారంగ ఽ జంబ్వామ్రమమ్ములు
తరుణంపుఁగిసలముల్ ఽ దాల్చెనెచట ?
జలజాతకువలయ ఽ సందోహముల యెడ
సాంద్రతల్ దొలఁకెడు ఽ సరసులెచట ?
శుభలక్షణమ్ములఁ ఽ జూచుట కింపైన
గోరాజసంతతుల్ ఽ గూడెనెచట ? ।
ఆనయమ్ము జనముల ఽ యాననమ్ములఁ దాండ
వము సల్పసంతుష్టి ఽ పాఱెనెచట ? ॥
గీ॥ అకట! తుంగముస్తలు రెల్లు ఽ లలరె నేఁడు
గడ్డిపూవులె కన్నులఁ ఽ గాన నయ్యె ।
బురదగుమ్ములు శూన్యత ఽ లరయ నలసె
విజయనగరాన వెలసిన ఽ విజయలక్ష్మి ! 21

"నాశనమ్మెల్ల చోటుల । నాట్యమాడె ।
విజయనగరాన వెలసిన । విజయలక్ష్మి ॥"



45. హాంపి శిథిలములు. *By kind permission of* K. Nageswararao Garu.

సీ॥ ఎసియించుమానవ భావవైఖరి నభ్ర,
పాళిఁదాకెడు సౌధ పంక్తి యెచట? ।
తలఁపులయచ్ఛతఁ దెలిపెడు ననురీతిఁ
దెల్లనౌ గోడల దీప్తు లెచట?
ఉన్నతజన్మము నుద్ఘోషణము సేయు
మాణిక్యదేహళుల్ మలసె నెచట? ।
ఐశ్వర్యసూచియై యలరారు హాటకి
పంజరశుకముల పలుకు లెచట?

గీ॥ వైభవమ్మెల్లఁ గలలోని వార్తయయ్యె
ఘనములౌ గేహముల్ డల్లి గలసిపోయె ।
కనకరాసులు చోరులు గొనఁగనయ్యె
నాశనమ్మెల్లచోటుల నాట్యమాడె ।
విజయనగరాన వెలసిన విజయలక్ష్మి! ॥ 22

సీ॥ సామంతరాజులు సతతమ్ము జోహార్లు
సల్పెడు విభవ వైశాల్యమెల్ల ।
దక్షిణమ్మననుండి తప్పక పన్నులు
గావచ్చు హేమప్రకాండమెల్ల ।
రాజులతనువుల రాజిల్లు వేషముల్
ప్రతిఫలించెడు రుచిరాజియెల్ల ।
ధర్మపద్ధతిఁ దీర్పు ధర్మాధికారులు
పల్కెడు శాసన వారమెల్ల ॥

గీ॥ నింద్రజాలికు మాయయై యెగిరిపోయె
ప్రళయ సమయంపు సర్గపుఁ బగిదినయ్యె ।

మనసునందున మాత్రమ్ము § గనఁగ నయ్యె
విజయనగరాన వెలసిన § విజయలక్ష్మి! 23

సీ॥ సచివవృద్ధులఁగూడి § సాచివ్యమును సల్పు
నాలోచనామంది § రాంతరములఁ।
బోతుటీఁగయు లోనఁ § బోవంగ వీల్గాని
యవరోధమందిరా § భ్యంతరముల।
నాయుధపాణులై § యనిశమ్ము యోధులు
పహారాల నిచ్చెడు § భవనములను।
దేవతార్చన సల్పు § దేవాలయమ్ముల
నినరశ్మి చొరనిభూ § గృహములందు॥

గీ॥ నెల్లచోటుల శూన్యత § వెల్లుకొనియె
నన్నియునుగూడఁ బెద్దమ్ము § కరణమయ్యె।
పగులదేగుండె, చూడ నె § వ్వానికైన
విజయనగరాన వెలసిన § విజయలక్ష్మి! 24

సీ॥ పట్టు డేరాలలో § బంగారు వేదికల్,
కనులకు మిఱుమిట్లు § గలుగఁ జేయఁ।
గనకసింహాసన § మునఁ గాంతితతి నించు
నుపలముల్ హృదయంబు § లుబ్బఁజేయ।
రాజాధిరాజుల § రాజ్యముల్ తెగనమ్మ
వెలరాని మకుటమ్ము § తెలివిఁద్రోల।
ఘనరత్నఖచితమౌ § గండపెండేరంబు
వీక్షించువారికి § వింతఁగొలుప॥

గీ॥ విరివియై యున్న మంటపో § పరితలమ్ము
నందుఁగల దేవతా విగ్ర § హమ్ము విజయ।

దశమిఁ బూజించు టెల్లను ఽ దఱలి పోయె ।
విజయనగరాన వెలసిన ఽ విజయలక్ష్మి ! ॥ 25

సీ॥ స్నానాదులను సల్పి ఽ సంధ్యల ముగియించి,
బ్రాహ్మణుల్ నామముల్ ఽ పాడుచుండ ।
తెల్లని రోజాలఁ ఽ జల్లుచు బాడబు
లశ్వపూజలఁ బెక్కు ఽ లాచరింప ।
మంత్రాక్షతలతోడ ఽ మాతంగముల పూజ
సందులేకుండఁగ ఽ జరుగుచుండ ।
తొమ్మిది దినములు ఽ తొందరలేకుండ
దేవికిఁ బూజలు ఽ తీరుచుండ ॥

గీ॥ నొప్పుచుండెడు దసరా మ ఽ హోత్సవంబు
కాలవాహినిలోఁ బడి ఽ కదలిపోయి ।
కనుపొడుచుకొన్నఁగనుపట్టఁ ఽ గలదె నేఁడు
విజయనగరాన వెలసిన ఽ విజయలక్ష్మి ! ॥ 26

సీ॥ మల్లభూమిని జేరి ఽ మల్లులు జతగూడి
దారుణ ముష్టి యు ఽ ద్ధమ్ము సలుప ।
నవరత్న ఖచితమై ఽ తవణిల్లు భూషలు
దాల్చిన స్త్రీలునృ ఽ త్యమ్ము సలుప ।
జలపూరితస్వర్ణ ఽ కలశమ్ములను దాల్చి
యెఱువది సుందరుల్ ఽ దిరుగుచుండ ।
నెవరి వింతల వార ఽ లెదురుగా జనములు
మించువేడుకఁ బ్రద ఽ ర్శించుచుండ ॥

గీ॥ పసిఁడిరోజాలు తెల్లనౌ ఽ వస్త్రములును
దాల్చి సంతస ముప్పొంగ ఽ దరినిఁ జేరి ।

చక్రవర్తియె సంభ్రమమ్మె జరుపఁడేల ?
నాథుఁడే లేని దీ మహా నవమి దిబ్బ ।
విజయనగరాన వెలసిన విజయలక్ష్మి ॥ 27

చ॥ కనక వికారముల్, రజత
కల్పితముల్, మణిరాజితమ్ములు
న్ననుపమపన్నగాది లిఖి
తాంచితమౌ ముఖపట్టపాళి, యా ।
ననముల మీఁదఁ జెన్నొనఁగ
నవ్యదుకూలము లంగ రాజిపైఁ ।
దనరఁగ, నశ్వరత్నములు
దారత బారులు దీరి యుండఁగన్ ॥ 28

మ॥ ఘనలోహాంచిత విస్ఫురత్కవచముల్,
కౌశేయ కేతుచ్ఛటల్, ।
కనకాలంకృత శీర్షభూషణములున్,
కౌక్షేయముల్, తప్త కాం ।
చనదీవ్యన్నఖ భల్లముల్, పరశువుల్,
శాతాసి పుత్రీతతుల్. ।
తనురాజిన్ వెలుఁగొంద, నాశ్వికులు మీఁ
దన్ జేరి వీక్షింపఁగాన్ ॥ 29

మ॥ ఇలయెల్లం బ్రతిశబ్దముల్ గొలుపఁగా
నేపైన ఘంటాళి, చం ।
చలసౌధా కృతులౌ వరండకములుం
జండోగ్రదైత్యాకృతుల్ ।

"నాథుఁడేలేని దీమహా । నవమిదిబ్బ ।
విజయనగరాన వెలసిన । విజయలక్ష్మి !"




48. మహానవమి దిబ్బయొక్క దక్షిణభాగము. *By kind permission of* K. Nageswararao Garu.

గల లోహాననపట్టముల్ గలిగి రం
గత్తుంగ భూమీధ్రపం ।
క్తులోనానొప్పు మతంగరాజి కడలన్
ద్రోవన్నిరీక్షింపఁగా ॥ 30

మ॥ తఱినాహారము చిక్కఁ దేరుకొని, యు
ద్యచ్ఛీర్ష కాంతమ్మునై ।
వరుసల్ గట్టిన పై ర్లరీతి, బిలగ
ర్భంబుల్ వడిన్వీడియు ।
ర్వర పై కిం బఱ తెంచు చీమలగతిం
బారంబు లేకుండఁగా ।
నిరుపార్శ్వంబుల బార్లు దీరి పదగుల్
వీక్షించుచు న్నిల్వఁగా ॥ 31

సీ॥ ఇరుప్రక్క లనుదోఁచు ♦ నింద్రచాపమ్మునల
గతినాతపత్రయు ♦ గమ్మునెఱయ ।
నన్యులకెన్నఁడు ♦ నందనిరవివాజి
యనుకీతి నభిషేక ♦ హయము దనరఁ ।
దనుఁజుట్టి యెప్పుడు ♦ ననుసరించెడు గ్రహ
వితతి నారాజులు ♦ వెనుక వెడలఁ ।
దనప్రభావముఁగాంచి ♦ దినమును హర్షించు
జనులునాఁ దనచుట్టు ♦ జనములలర ।

గీ॥ మణివిభూషలు భాసురాం ♦ బరములెసఁగ
బలములనుజూచి చిఱునవ్వ ♦ మొలకలెత్త ।
రాజమార్తాండుఁ డీనాఁడు ♦ రాఁడదేల

విజయ దశమిని నీపుర శ్రీ వీథులందు ।
విజయనగరాన వెలసిన శ్రీ విజయలక్ష్మి ! ॥ 32

ఉ॥ మూఁడుశతాబ్దముల్ మును న
మోఘముగాఁగ స్వతంత్రతాస్థితిన్ ।
జోడొకఁడుండకే విభవ
సూత్రములన్ గరమందుఁబూని, య ।
ట్లాడఁగనీక రాజులను
నందఱనేలవె, యట్టి నీకు నీ ।
నాఁడు ఘటించె నాశనము
నంతపుఁగాలము రాజ్యరత్నమా ! 33

చ॥ ఇరువది రాజరాజుల య
హీనపరాక్రమమంది నీవు పెన్ ।
గరువముతోఁ జెరింగియు న
నాథవె యైతివి, దానితోడ నిన్ ।
మఱవక కాల పూరుషుఁడు
నామము, స్థానము, రూప సంపదన్ ।
దొఱఁగఁగఁజేసి శూన్యతకుఁ
దోడుగఁజేసెను రాజ్యరత్నమా ! ॥ 34

ఉ॥ నీకుఁగలట్టి శత్రువుల
నిర్జితులం బొనరింతు మంచు, శ ।
క్త్యైకృతులౌచుఁ గంకణముఁ
గట్టిన భూధవవారమేడ ? కా ।
ర్యాకృతు లౌచుఁ దుట్టతుది
నందఱు భగ్నతనొందరే, మహా ।

భీకర కాలమూర్తికడఁ
బేర్కొననౌనె దయాప్రవర్తనల్ ॥ 35

చ॥ తనువఖిలమ్ము మున్ను దినఁ
దక్కిన యెమ్ములరెంటిఁగాంచి, పో ।
యినఘనసత్త్వరూపము గ్ర
హించినరీతిఁ ద్వదీయశీర్ణతా ।
జనితములైన యీశకల
సంచయముంగని, ప్రాఁతయున్నతిన్ ।
మనమున నెంచుకోవలసె
నా ! నినుఁగాంచఁగవచ్చువారికిన్ ॥ 36

చ॥ సకల శుభాంకలక్షితము,
సర్వవిభూషణభూషితంబు, పృ ।
థ్వికినొక భూషణమ్మనయి
పెంపువహించిన రాజ్యనాగ మీ ।
శకలములన్ గనుంగొనిన
సాంగముగా మదిఁదోఁచ నేర్చునే ?
ఒకటియొ, రెండొ రాలఁగన
నూహకు వచ్చునె, యాహిమాద్రియున్ ॥ 37

చ॥ ఘనమగు నీదు వైభవముఁ
గాంచఁగవచ్చిన నాఁటి వారికిన్ ।
దనయులు, నేఁడు పాల్పడిన
నాశనమున్ గనవచ్చుచుండిరే ।
మనఁదగు, నున్నతస్థితి మ
హాధికులౌ నిజబంధుపాళి ని ।

ర్థనులయిరన్న వే చని ప
రామరిసంబొనరింపరే జనుల్ ॥ 38.

చ॥ అనుపమ భూషణమ్ములన
నారతముఁ ధరియింపఁ జేయుచుఁ ।
ఘనతరసత్కళావిలస
నమ్ములసర్వముఁ గూర్చి ప్రీతిమైఁ।
పెనిచినయాత్మజఁ శిఖిని
బెట్టిన వైఖరి నిన్నుఁ గోవధల్ ।
పొనరుచు మ్లేచ్ఛహస్తముల
లోనిడి పోయిరి త్వత్ప్రివర్తకుల్ ॥ 39.

ఉ॥ ప్రాణము తీపియంచు రణ
రంగముఁ బోవిడి పాఱినారు, మీ।
బాణము లేల ? నూఱిన కృ
పాణము లేల? శతఘ్నిపంక్తికిన్ ।
ప్రాణయు నేడ ? జీవము ర
ణమ్మునఁ బోయిన నష్టమేమి ? స్వ।
ప్రాణముపైని దీపుగల
వారలు వీరు లె ? మీరు రాజు లే ? 40.

ఉ॥ చేతను గత్తి దాల్చియును
జేవఁదొఱంగుట మీకృపాణమున్ ।
నాతుల చేతిలోఁ గరిగె
నాఁదగు నన్నను దోసమున్న దే ?
భూతల భూషణమ్మనఁగఁ
బొల్చినరాజ్యము జంకకే మహా ।

రాతుల చేతుల న్విడిచి
ద్రావితులై రిగదా ! చమూపతుల్ ॥ 41

మ॥ తురకల్ రాజ్యముపై ని యుద్ధమునకుఁ
దో తెంతురన్వార్త, భీ ।
కరమై శ్రోత్రములందుఁ జొచ్చిన మహా
కార్యజ్ఞుఁడౌ రామభూ ।
వరుఁడత్యద్భుత సైన్యవారమును సం
పాదించి యవ్వారి సం ।
గరరంగమ్మున నోడ్చిపుచ్చెఁజనఁడే
గాఢప్రతాపోన్నతిన్ ॥ 42

చ॥ తిరుమల రాయఁడొక్కదిశ
ధీరతనిల్వఁగ వేంకటాద్రి యే ।
మఱిక మఱొక్కప్రక్కరిపు
మార్గమునడ్డఁగ, రామధారుణీ ।
శ్వరుఁడునపారవాహినియు
వారికి మధ్యను నిల్చి పెంపుమై ।
దురమొనరింపవచ్చుపగ
తుర్ గనవేచిరి కృష్ణయోద్ధునన్ ॥ 43

చ॥ అలఁతిబలంబులంగొని, మ
హార్ణవముందులకించు రామరా ।
డ్బలములతో రణంబుసలు
పన్ బఱతెంచుమహామ్మదీయులా ।
వలిదరికేగి రామవిభు
పైఁదగు సాహసమొప్పఁగా శత ।

ఘ్నులవెడలించి రంతఁగడు
ఘోరముగాఁగ రణంబు వర్తిలెన్ ॥ 44

శా॥ ఏనుంగొక్కటి పిచ్చిపట్టి రభసో
ద్వృత్తిన్ సమీపింపఁగా।
భూనాథున్వహియించుపల్లకినటం
బోఁద్రోసి తద్వాహకుల్।
ప్రాణప్రీతిని బాఱిపోవ రిపువా
రం బెల్ల నచ్చోటికే।
సైనన్వచ్చినృపున్ గొనెన్, నొసటిఁబ్రా
ల్దప్పింప నెవ్వానికౌ ॥ 45

ఉ॥ పోయినరామభూవిభుఁడు
పోయెను పెద్దలఁజేరెఁ గాని యే।
మాయెను మీకుఁ దిర్మలన్న
పా! పరిశిష్టచమూపతుల్! మహా।
ధీయుతరామ రాయలవ
ధించినవారికి మారుసేయఁగా।
నాయముగాదె! వైరులను
నాశమొనర్చుట ధర్మమే గదా॥ 46

ఉ॥ ఆనయకోవిదుండయిన
యన్నయుఁ, దమ్ముఁడు వేంకటాద్రియున్ *।
బ్రాణముఁగోలుపోయిరని
మ్లానతఁదాల్చిన తిర్మలేశుపైఁ।

---

* ఈతని మృతిని గుఱించి భిన్నాభిప్రాయములు చరిత్రకారుల యందుఁ గలవు.

బూనిక కార్యభారమును
మోపి జయమ్మునుగైకొనంగ నే।
వేని ప్రయత్నముల్ సలుప
రే! సమరక్రమపాండితీధనుల్ ॥ 47

చ॥ వెనుకకునొక్కసారి నిజ
వీక్షణముల్ పఱపించి, పాఱుమీ।
జనముల నేవిధిన్ రిపులు
చంపుచునుండిరో చూచినారె! మీ।
పనులనె మీరుచూచుకొని
పాఱెదనంతటి పందలే, మహా।
జని నిజధర్మవర్తనకు
జీవములేటికి భారవ్రాయరో॥ 48

ఉ॥ వేలకువేలు జీవములు
పేరునులేకనశింప నాల్గు ప్రా।
ణాలకువచ్చెనే భయము ?
నాథులమేమని ముందునిల్చి, సై।
న్యాళినిఁ ద్రిప్పి తీరనిజ
యమ్మునొ వీరులస్వర్గసౌఖ్యమో।
కేలనుదాల్చి క్షత్రియుల
కీర్తిని నిల్పఁగ వీలుగల్గదే ॥ 49

చ॥ అరుల కజేయమైన వర
ణాంతరమున్వడిఁ జొచ్చి దానినే।
వెరవున రక్షచేసికొని
భీతిఁ దొలంగెడు వారమంచు, నె।

త్తరుణమునైన యోచనల
దారినిఁ బోతిరె? పాఱిపోవఁగాఁ।
దెరువునుఁజూచి కొంటిరి గ
దే! తమరెల్లరు వాహినీపతుల్ ॥ 50

ఉ॥ ఏమిఘటిల్లెనో యెఱుఁగు
నిచ్చను వచ్చిన పూరుషాలికి।
రేమి వచించినారు, తమ
యింటి సుమాంగులకేమి దెల్పి రా।
రామవిశాలసౌధముల
రాజిలుచుఁ బహుమర్త్యవాస మై।
భూమిని సాటిలేనిపుర
ముఁ విడనెట్టుల మీకుఁదోఁచెనో! ॥ 51

ఉ॥ వందలకొద్ది యేనుఁగుల
పై మణిరాసులు భర్మకుండికా।
బృందము, ముద్రయుఁ నృపకి
రీటము, సన్మణి నూపురమ్ము నె।
త్తం దగునంతపైఁడి నిడి
తక్కినవారలఁ బల్కరింపకే।
పొందగుదారిఁ బట్టుకొని
పోయితి రీరలు పోటుదొంగలో ॥ 52

ఉ॥ తాతలు మున్నుకష్టపడి
దాఁచినయాస్తి యటంచురత్నముల్।
చేతగ్రహించి పాఱితిరో?
చేనులఁ జెమ్మటనూర్చి మీప్రజల్ ॥

బ్రాఁతిగ నిచ్చు నేఁటిబడి
పన్నులసొమ్మది; కష్ట కాలమం।
దాతత భీతిగ్రమగ్గెడు జ
నావళిఁ బ్రోవఁగలేని మీకునే।
కీతిని వారిద్రవ్యము హ
రింపఁగ హక్కువ్వెసంగుఁ దెల్పుఁడీ॥ 53

ఉ॥ పూర్వము రాజులెవ్వరును
పోరనునోడరె, మిమ్ముఁబోలివా।
రోర్వక పట్టణంబువిడు
నూహనుబోయిరె? వైరికోరు నా।
సర్వధనంబులు న్నొసఁగి
సంధియొనర్చరె? మీరుఁగూడ యు
ద్ధోర్విని నోడినందులకుఁ
ద్రోక్కఁగరాదె తదీయమార్గముల్॥ 54

మ॥ అరులంజంప నపారసైన్యములు వీ
రానీకనీతమ్ములై
దురముంజొచ్చె జయమ్ముతథ్యమని భీ
తుల్వీడి యజ్ఞానులై
స్థిరదైనందిన కార్యమగ్నులగు వి
స్తీర్ణ ప్రజాపాళికిన్।
వెరవేముండుఁ దురుష్కకర్కశగదా
భీలాహతుల్ దక్కఁగాన్॥ 55

ఉ॥ నాలుగుపాయముల్ దెలియ
నాథుఁడునై తగు బంచతంత్రముల్।

పాలనసేయఁగాఁ దగిన
భాసురబుద్ధిని భామినీ నృపా।
లాళిని నేలవైఁబఱపి
యాడెడు సాచికలట్లుద్రిప్పఁగాఁ ।
జాలిన రామభూవరుని
చాయయొకింతయు మీకుఁగల్గెనే॥ 56

మ॥ ఒకనాఁడేనియు భామినీనృపులు మీ
కున్నట్టి రాజ్యంపుఁ ద్రో ।
వకునై నందమ దృష్టినేనియును ద్రి
ప్పంజాలిరే, రామరా।
జకృతు ల్వారికి వారిలోఁ గలహముల్
సంధిల్లఁగాఁ జేయవే ।
యకటా ! వానికిఁజెందు మీరు నగర
త్త్యాగమ్ముఁగావింతురే ॥ 57

శా॥ నీలాలోల తరంగసంఘములతో
నీవైన సుప్పొంగి యా।
భీలోత్తుంగజలాతి నిస్సృతి రణో
ర్వి న్ముంచి, పాషండులన్ ।
లీలాకందుక క్రీడనచ్చిత పురీ
లీలావతీ శీర్షకీ ।
లాలవ్యాప్తుల వైరులన్ దునుమ వే
లా ! తల్లి ! కృష్ణానదీ ॥ 58

శా॥ ఆమూలన్ జరమాద్రిఁ బుట్టి పరమ
స్వచ్ఛంబయౌ నీటితో ।

భూమింబూత మొనర్చి యాంధ్రులకు స
మ్మోదంబు నైశ్వర్యముఁ ।
క్షేమంబున్ గలిగించు నీజలములం ।
గీలాల మున్నించినా ।
రో మాతా! రిపునాథులింకఁ బ్రతికా
రోద్యోగమూహింపవే ॥ 59

మ॥ అదిగో! పోవుచునున్న దే, రిపుల సై
న్యంబెల్ల పట్నంబులో ।
విదితంబైన సమస్త సౌధముల ను
ర్వింద్రోయు సద్బుద్ధితో ।
సదనారాధిత నారసింహ! వడిఁదై
క్ష్ణ్యంబెల్లఁజూపించి, యా ।
పదఁబోఁగొట్టఁగరాదె, నీ వయిన నీ
భక్తాళి రక్షింపవే॥ 60

చ॥ వననిధినుండి వెల్వడిచి
పైఁగలచిప్ప విదల్చి యామిషా ।
దనముల శ్యేన గృధ్రముల
దారినిఁబెట్టిన కూర్మదేహమో ।
యనెడువిధిఁ పురమ్ము! మను
జాశనతుల్యుల కొప్పగించి, వే ।
చనిరి త్వదీయ రక్షకుల
శక్తులు కాఁగలదేమి యున్నదో ॥ 61

చ॥ తొలఁగెను నాయకుండనుచు
దొంగలు, దోఁపిడికాండ్రు, కొండగుం ।

పులు నడి వీధులందు ధన
మ్ముల్ గొనిపోవఁగ సాహసించిరీ।
జలధిపరీత సర్వమహీ
చక్రమునందొక సాటిలేని నీ।
కలవడెనెట్టి దుర్దశ, య।
హా! యెదఁబ్రీలదె విన్నవారికిన్॥ 62

సీ॥ సొమ్ములఁ గైకొని ♣ మమ్ముల రక్షింపుఁ
డీ! యని వెల్లుదుః ♣ ఖించువారు।
నాఁడుతోఁబుట్టువు ♣ లలరియుండరె మీకు,
నని పెద్ద యేడ్పునఁ ♣ జనెడు వారు।
మమ్ముఁ బెట్టెడుబాధ ♣ మిమ్ములఁ గుడిపింప
దే! యని కడు శపి ♣ యించువారు।
నీ నాఁటికీకష్ట ♣ మేగుదెంచెనిఁకేమి,
యీశ్వరా! యనిదేవు ♣ రించువారుఁ॥
గీ॥ గరుణనీకైనఁ గలుగదో ♣ కమలనాభ
యనెడు వారును నెల్లెడఁ। గనఁగనైరి।
కఱకుచేతులఁ బడి సొంపుఁ ♣ దొఱఁగినట్టి
విజయనగరాన వెలసిన ♣ విజయలక్ష్మి!॥ 63
ఉ॥ వీరికిఁదోడు శత్రువులు
వేలకు వేలు కుఠార శస్త్రికా।
ధారులు క్రూరవర్తనులు
ధర్మవిదూరులు కాలకింకరా।
కారులు, రక్తపాతమున
కై తపియించి జనాళిపైఁ గసిన్।

దీక్షుచుకోఁ దలంచి యరు
దెంచి రిఁకేమి వచింపఁగాఁదగుఁ౯ । 64.

క॥ కత్తుల గడ్డపారలను
గర్కశ ఘోర కుఠారధారలం।
దుత్తమురుం బొనర్చితి ర
థోగతి పాలొనరించియుంటివీ ।
యుత్తమ విగ్రహమ్ములను
నున్నత భాసురహర్మ్య పంక్తులఁ;।
గత్తులఁదాల్ప మీకుఁదగు
నా ! యిది వీర్యమె ! వైరి సైనికుల్ ! ॥ 65.

సీ॥ నవమాసములునిండ ✠ నవనవ లాడెడు
చూలాండ్రఁ గత్తికిఁ ✠ జూరలిడరె ।
క్యారుక్యారు మటంచు ✠ నార్చెడు శిశువులఁ,
గరవాలధారల ✠ నఱక లేదె ।
మూఁడుకాళ్లనుబోవు ✠ ముదుసళ్లుల్ మీబుద్ధిఁ
బోరఁగాఁ దోరకొను ✠ వీరులైరె ।
దేవాలయమ్ముల ✠ దీపించెడు శిలాళి
సాధింపఁదగు గర్భ ✠ శత్రులైరె ।
గీ॥ ఏమిలాభంబు గల్గెని ✠ క్లేడిపింప
వారియుసురులు తాఁకునఁ౯ ✠ భయము లేదె ।
దేవుఁడున్నాఁడు చక్రంబు ✠ తిరుగుననుచుఁ
జూడరే ! కర్కశ తురుష్క ✠ శూరులార ॥ 66.

ఉ॥ కాసరయూధముల్ కమల
కాండవిభాసితమా జలప్రహదం।

బీసునఁ బంకిలంబు నొన
రించెడు రీతిని, గోఁతిమూఁక పు।
ష్పాసవభాసమాన తరు
సంచయమొప్పెడుతోఁటఁ బాడుగాఁ।
జేసినయట్లు చేసితిరి
చెప్పఁగరాని పురీ విలాసముల్ ॥ 67

ఉ॥ శూరతగల్గినన్ రిపుల
శూలములంగొని వ్రేయవచ్చు, దు।
ర్వారశతఘ్నివక్త్రమునఁ
బాడుచునృత్యము సేయవచ్చు, నే।
ఘోరమెఱుంగనట్టి పసి
కూనల ఖడ్గము పాలొనర్తురే।
సారసగంధులన్ గసిమ
సంగుదురే నిజశక్తిఁజూపఁగా॥ 68

ఉ॥ రాజులు రాజులున్ సమర
రంగములో బవరంబు సల్పనే।
రాజు జయించునో యతని
రాజ్యములో సుఖయించుఁటే ప్రజా।
రాజకియుక్తి, వారిపయిఁ
గ్రౌర్యముఁ జూపెడుచో జయప్రభా।
రాజితరాజరాజులొక
రాజులె! దోఁపిడికాండ్రు గారొకో ॥ 69

ఉ॥ మీకును రాజ్యముల్ గలవ
మేయజనాళి వసింతురందు, వెన్।

కాకను నోర్వఁజాలక వి
కావిక మీఱలు పాఱ శత్రుల।
బ్రాకలఁబెట్టి మీ ప్రజల
నందఱ ఖడ్గము పాలు సేయఁగా।
నే కరణిన్ దపించెదరొ
యించుక యెంచరె మ్లేచ్ఛపాలకుల్॥ 70

చ॥ అడిగినపన్నులిచ్చి తగు
నట్లుగ శాంతిని జీవనమ్ములన్।
గడపెడు సత్ప్రజన్ విజయ
గర్వితశాత్రవరాజ సైనికుల్।
కడుఁగడగండ్లఁ బెట్టఁ దగు
కర్జమె! వైరినృపుండు సైన్యముల్।
పడఁదగు వారలైన జన
వారము గూడను వధ్యులౌదురే॥ 71

చ॥ జరిగెడు యుద్ధము న్విడిచి
సన్నుతమైన పురంబు వీడి స।
త్వరముగఁ బ్రాణరక్షకయి
వైరులు పాఱఁగ, రాజ్యమంతయున్।
గరమునఁదాల్చి పాలనము
నర్చెడు బుద్ధిని మాని యీర్ష్యచే
నరమరలేక యందఱను
హత్యయొనర్చుట యున్నతంబొకో॥ 72

చ॥ ధనమునొసంగి కొంటిమను
దానఁ బయస్వినియైన ధేనువున్।

స్తనములుగోతుమే దురము
సల్పియనంతపుఁ గష్టమంది, కై ।
కొనిన యతుల్యమైన సుమ
కోమలిఁగ త్తికిఁ జూఱలిత్తు మే ।
మునుగల కేతకీకుసుమ
మూర్ఖవిధమ్ము స్మరింపఁజేయఁగా ॥ 73

చ॥ కళలకు నాలయమ్ము కృతి
కర్తలకున్ శరణమ్ము, పెక్కు వి ।
ద్యలకొక యిమ్ము, నాగరక
తావ్రతతీతతి కాశ్రయమ్ము, నీ
యిలకొక భూషణమ్ము, మను
జేశుల యాశల లాగుసామ్ము నై ।
బలిసిన సత్పురీమణిని
ధ్వంస మొనర్చుట నేమి లాభమో ॥ 74

సీ॥ పోర్చుగీసులు చూచి ✲ పొగడిన వైశ్వర్య
మున నెప్డుఁదులఁదూగు ✲ పురవరమ్ముఁ ।
పారశీకులుగాంచి ✲ బాపురేయని మెచ్చు
వైభవమ్మునఁనొప్పు ✲ పట్టణమ్ము ।
నన్యులు వీక్షించి ✲ యాశ్చర్యమున ముగ్ధ
లై యుండిన మహాజ ✲ నాశ్రయమ్ముఁ ।
దక్కిన రాజులు ✲ గ్రుక్కిళ్లు గ్రింగెడు
నంతటి యౌన్నత్య ✲ మలరు బురము ।
గీ॥ ధ్వంస మొనరింప మీకెట్లు ✲ తలఁపుగలిగె ।
వారిఁబోలిన వారలు ✲ మీరుగారె ।

సరస విజ్ఞాన సత్కళా సంపదలకు
గౌరవంబేమి మీకును గలుగఁ బోదె॥ 75

శా॥ మీపట్నంబున సత్కళల్ వెలయువే !
మీస్త్రీలకుం గౌరవం।
బాపాదింపరె ! శిల్పమంతయునమే
యంబైన ప్రేమంబుతోఁ।
గాపాడంగఁ బ్రయత్నముల్ సలుపరే !
కష్టంబు లేకుండఁగా ।
నీపట్నంబు లభించెమాకనుచు గ
ర్వింపంగఁ గాదే మదిన్ ॥ 76

మ॥ అసమానంబగు నీపురంబు శిథిలం
బైనంతఁ దద్భర్తకే ।
పౌసఁగె న్నష్టమటంచు నెంచితిరె! యీ
భూమిస్థలిన్ గల్గుమ ।
ర్త్య సమూహంబుల కెల్లనిద్ది యపరా
ధంబంచు నూహింపరే ।
కసిచే రాహువు చంద్రబింబమును గ్రిం
గన్ లోకమల్లాడదే ॥ 77

× × × × × × × ×

శా॥ జౌరా ! యేమిది ! యెంతయున్నతి ! మనో
వ్యాప్తంబునై చూపటన్ ।
భీరుత్వమ్మ్ను వహింపఁ జేసెడిని, గాం
భీర్యంబు రూపై ముఖ ।

ద్వారంబందుఁ, గరాళదంష్ట్రిలను రౌ
ద్రస్ఫూర్తిఁదీంద్రించు వి।
స్తారాకారము నారసింహునిది గా
దా ! యేమి రూపంబహో ! ॥ 78

ఉ॥ ఏకశిలాప్రకల్పిత మి
దెవ్వరిచే రచియింపఁగాఁ బడెన్ ।
భీకరమూర్తిఁ దాల్చి పర
మేశ్వరుఁడీవిధిఁ బాపికోటిఁ జీ ।
కాకువొనర్చు నంచు బలు
కందగదే ! యిదిగాంచు వారిక ।
ల్పాకృతులైన మానవుల
యల్పత తప్పక గోచరింపదే! ॥ 79

చ॥ కళలు సమస్తముల్ మనుజ
కార్యములన్, దమచిత్తకందకం ।
దళితములైనభావములఁ
దప్పకచొచ్చి సుఖమ్ముదుఃఖమున్ ।
గొలుపుచు భావివృత్తినను
కూలముగా నియమింపకున్నె, స ।
త్కళలమునింగి తన్మయతఁ
గాంచినవారలు పెక్కురుండఁగా ॥ 80

మ॥ శిలయే యైనను దీన జీవకళ యు
జ్జృంభించి తోడ్తోడ న ।
తులత్రోవంబడి దేహమెల్లెడ వడం
కుల్ గల్గఁగాఁజేసి, మ ।

ర్త్యులకున్ బారము లేనిసర్గమున, వి
ధ్యుక్తంబు నా స్థానమున్।
దెలియంజేయదె? చూచువారలకు బు
ద్ధిన్ వృద్ధి గావించుచున్ ॥ 81

మ॥ అలనాఁడొక్క ద్విజుండు రాజనగర
ద్వారంబునన్నిల్చి రా।
యలఁదర్శింపఁగఁగోరి శిల్పిననువా
క్యంబున్ బ్రతీహారిచేఁ।
దెలియంజేసి యనుజ్ఞఁగాంచి తన వి
ద్దెంజూప నీరూపమున్।
శిలలోఁజెక్కి యనేక గ్రామములఁగాం
చెన్ రాచచాగంబునన్ ॥ 82

మ॥ పరమేశప్రతిబింబమే ప్రకృతితో
వర్తిల్లి రూపంబుతో।
ధరపై జీవవిధంబు దాల్చునను వా
దంబట్లు, నీచిత్తమం।
దు రహింపందగు రూపమీశిలలపొం
దుక్ గాంచి మాంసాత్మికిన్।
స్థిరమైతోఁచునుగాదె నీవు చనినన్
శిల్పప్రభాచంద్రమా ॥ 83

చ॥ వివిధములైన రూపములు
వేలకువేలు సృజించి దృశ్యమా।
భువనమునింప బ్రహ్మకును
భూతములే తగు ముఖ్యకారణం।

బవ్రును, త్వదీయసృష్టికి మ
　　హాశిలలెల్లను ముఖ్యకారణం ।
బవ్రునిఁక మీాకునిర్వ్యారకు
　　నంతరమెయ్యది శిల్పిశేఖరా! ॥ 84

సీ॥ దుమ్ములోఁబడిన బీ ॥ జమ్ముల వృక్షరా
　　జమ్ములఁ గల్పించు ॥ జాణయతఁడు ।
రాతిముక్కలఁదీసి ॥ రమ్యమా రూపముల్,
　　పొనరించు చాతుర్య ॥ ఘనుఁడవీవు ।
తనసృష్టి జూపించి ॥ జనులకు నవనవ
　　విద్యల బోధించు ॥ వేత్తయతఁడు ।
నీచెక్కడముఁజూపి ॥ నిఖిలరసమ్ముల,
　　నెలకొల్పఁ జాలు పం ॥ డితుఁడవీవు ॥
గీ॥ మీాకు పరిమాణభేదమే ॥ మెలఁగుఁ గాని
　　ధర్మభేదంబు కొంచెముఁ ॥ దనరఁబోదు ।
　　శిల్పిశేఖర ! లోకమ్ముఁ ॥ జేయునట్టి
　　యీాశ్వరునిరొుక్క ప్రతిబింబ ॥ మీావుగావె ॥ 85

చ॥ దినములుపోవు చున్నకొలఁ
　　దిన్ క్రమమై ఖరి వృద్ధిగాంచి ప్రా ।
ణినివహాముల్వికాసమున
　　నిగ్గులుదేరెడురీతి, నీదుచే ।
తను బొలుపొందు సేనమునఁ
　　దక్కకరూపముఁ దాల్చిశైలపుఙ్ ।
దునుకలు. చూచువారికి మ
　　నోహరమై కనుపట్టుచుండవే ॥ 86

సీ॥ భక్తియే మూర్తియై ప్రభవించి యెవ్వాఁడు,
భాగవతంబును బాడి యుండె।
కథయెల్లఁగన్నులఁ గట్టినయట్లుండ
వర్ణనల్ గంటాన వ్రాసెనెవఁడు।
కైతయే మోదంబుఁ గల్పించు ననియెంచి
తుచ్ఛమౌ ధనములఁ ద్రోసెనెవఁడు।
కన్నీళ్లుసోనలై కాఱంగ 'భారతి',
యెవనివేఁడఁగఁ గృత కృత్యయయ్యె॥
గీ॥ నట్టిపోతన చేసియు న్నట్టి కృతిని
గల్గునరసింహ రూపంబుఁ గాంచి యుంటి।
నిందునందును భేదమొ క్కింత లేదు
శిల్పిశేఖర! యిదియెట్లు చెలఁగెనయ్య॥ 87
మ॥ అనుమానమ్మన యోచనల్ సలుపనే
లా!మీరు వ్యక్తిత్వమం।
దునఁగాలంబున నామధేయముల భి
న్నల్గాని మీయంతరం।
బునఁజైతన్యము మాత్రయొక్కటియె సు
మ్మూహింప, లేకున్ననీ।
ఘనరూపంబౌక రీతివెల్వడునె, మీ
గంటానసేనమ్మనన్॥ 88
మ॥ పరమంబౌమతితోడ, భావిపురుషుల్
త్వత్కార్యముం గాంచి య।
బ్బురముంజెంది ముదమ్మునంది మదిను
ప్పొంగంగ నిర్మించు నీ।

నరసింహాకృతి మ్లేచ్ఛసైనిక కర
న్యస్తోగ్రఖడ్గాళికి।
స్నైరస్థైమైపోయె మహాత్మదీని గనసీ
వెంతేని దుఃఖింపవే॥ 89

మ॥ మురువుల్ గూరిచి పోయు నచ్చున విధిన్
మోహమ్ము(గల్పించు భా।
స్వరరూపమ్మున మన్మథప్రసువు ను
త్సంగమ్మువై(జెక్కి త్వ।
త్సరసానూనకళావిలాసముల న
శ్రాంతమ్ము(జూపింప నీ।
తురకల్ దానిని పాడొనర్చిరి, కళా
ద్యోవీథికాచంద్రమా॥ 90

చ॥ గునపము( జేత(దాల్చియును
గొంచక యీనరసింహు శీర్షమున్।
గొనిపడ(ద్రోయలేక, తొడ(
గూరిన దానిని, నాడు(గూ(తురిన్।
మనసిజమాత( బిప్పిగ నొ
నర్చితిరెంతటి క్రౌర్యశాలులే।
మన(దగు మీబలంబు కుసు
మాంగుల( జంపెడు మ్లేచ్ఛ సైనికుల్!॥ 91

ఉ॥ ఇన్నిదినాలు రామ ధర
ణీశ్వరు శక్తికి లో(గి వారిచే।
మన్నన( గాంచలేని మతి
మంతులు; మీకొక సారి యిట్టుల।

త్యున్నతమౌ జయమ్మునగను
యోగమువచ్చిన నింతకంటెనే ।
యున్నతిఁ జూపనేరిచెద
రూరక మిమ్ములఁ దూఱనేమగుఁ ॥ 92

గీ॥ అనుచు నెన్నేని భావంబు ♦ లలరుచుండ
విజయపురవర విచ్ఛిన్న ♦ వీధులందు ।
తిరుగుచున్నాఁడు రాముండు ♦ తెలివిదక్కి
యొడలు తెలియునె, వగపులో నుండునపుడు ॥ 93

గీ॥ ఒకటఁబూర్వంపు స్థితినెంచి ♦ యుబ్బుచుండుఁ
గొండొకట శూన్యతను గాంచి ♦ క్రుంగుచుండు ।
మఱియు నొకచోట తనుదానె ♦ మఱచిపోవు
చెప్పవచ్చునె, రాముని ♦ చిత్తవృత్తి ॥ 94

గీ॥ తిరుగుచున్నాఁడు మనకేమి ♦ తిరుగనిండు
మనము రాగమహాంబుధి ♦ మగ్నమైనఁ ।
గలుగు సుఖదుఃఖముల్వాని ♦ కలరుఁగానఁ
బలుక కుండము పాఠక ♦ వర్యులార ॥ 95

చ॥ కొసరి వసంతకాలమునఁ
గోయిలకూయదె? నీలవారి ము ।
గ్విసరముఁగాంచి నెమ్మి పురి
విప్పుచునృత్యము సేయకుండునే? ।
అసమమరుత్ప్రతాడిత మ
హాధరణీజములూఁగకున్నె? మా ।
నసమతిదారుణమ్ములఁ గ
నన్ దగుమాటలఁ బైకిఁ బొంగదే? ॥ 96

గీ॥ కానరాముని యావేళ ❀ కారణమ్ము
తనకుఁ గలయట్టి పాండితి ❀ తానుగాంచు।
నట్టి దృశ్యమ్ము తప్ప న ❀ న్యమ్ముగాదు
పాఠకులు వేఱు తలఁపంగ ❀ వరుసగాదు ॥ 97

గీ॥ వరుసనెన్నని రాముండు ❀ తిరిగి తిరిగి
యరిగెవిఠ్ఠలస్వామిదే ❀ వాలయమ్ము।
అచటనేమేమి భావమ్ము ❀ లలరఁగలవొ
వినియెదము గాక మనకేమి ❀ వెడలనిండు ॥ 98

ద్వి తీ యా శ్వా స ము.

సం పూ ర్ణ ము.



# రామచంద్రుని హంపీయాత్ర.

## తృ తీ యా శ్వా స ము.

---

చ॥ ఇదియొక వెన్ప్రపంచము, ర
మేశునియాలయ మాత్రమంచు నే।
మదినిఁదలంచి వచ్చితిని
మానవశ క్తి స్వకీయకల్పనా।
విదితశిలాగ్ర మెక్కెనిటఁ
జేర్కొనఁజూచిన నెన్నిగల్గ వీ
సదనము పూర్వమానవుల
శ క్తికి సూచికగాదె చూడఁగన్॥ 1

ఉ॥ హైనమొః బంకమట్టియొ సు
మా! యనుమాదిరిఁ బెద్దరాలఁజేఁ।
బూని స్వకీయభావములఁ
బూనిక శాశ్వతముం బొసర్చి మా।
మానససీమలందుఁ బర
మంబగు నూహలఁబుట్టఁజేసి యా।
మానవపుంగవుల్ సుకృతి
మార్గమునన్ గతియించినారుగా॥ 2

ఉ॥ రాముఁడు లక్ష్మణుండనఁగ,
రాజిలు హ స్త యుగంబునాఁ, గళా।

భూమికి రెండు ప్రక్కలను
బొల్చెడు హద్దులనంగ, శిల్పకాం ।
తామణి రొమ్ముపై సొబగుఁ
దాల్చుకుచద్వయ మట్టు లీకళా ।
ధామమునన్ వెలుంగును గ
దా ! ఘనమంటప యుగ్మమెంతయున్ ॥ 3

మ॥ చిలుకల్ కోమలవృక్షశాఖల తుదిన్
జెన్నొందు పండ్లెల్ల ము ।
క్కులతోఁజీల్చి రసంబుఁగ్రోల, పికముల్
'కూ' యన్న గానంబుతో ।
నలుప్రక్కల్ ఘనమోదనిస్స్మృతిని నిం
డన్ జేయఁగానొప్పు నీ ।
విలసత్కేళివనాళి చిత్రములు హ్రా
ద్వ్యధిన్ స్థిరంబయ్యెడున్ ॥ 4

శా॥ ధీరుల్ కత్తులఁబూని యొండొరులతోఁ
దీక్ష్ణంబు గాఁబోరఁగా ।
వీరత్వంబు శరీరమున్ గొనిన తీ
విన్ శోణితాంబోధిలోఁ।
బారంబున్ గన లేక యీఁదు విధమున్
బాషాణచిత్రంబుఁ గ ।
న్నారంగాంచిన నబ్బురంబు పడరే
యత్యంతమొవ్వారలున్ ॥ 5

చ॥ గతవిషయ ప్రవృత్తులయి
కాంచన మూలకమైన సంసృతిన్ ।

"శిల్పకాంతామణి కొమ్ముపై సొబగు
దాల్చుకుచద్వయమట్టులు...ఘనమంటమ... మెంతయుఁ ॥"



74. విట్టలస్వామి దేవాలయములోని కళ్యాణమంటపము. { *By kind permission of* K. Nageswararao Garu.

సతముత్యజించి, మానసము
శాంతికి వాసముగాఁగ, సత్తపో ।
జితరిపువర్గులౌ పరమ
సిద్ధులరూపము లెన్నిగల్గ వీ ।
ప్రతత శిలావికారమయి
భాసిలు మంటపమందుఁ గాంచుచో ॥ 6

చ॥ అదియిది యంచు పల్కనగు
నా! పరమేశ్వరు సృష్టియందు నె ।
య్యదివిలసిల్లునో యదియు
నంతయు నిచ్చటఁగాంచవచ్చు, నె ।
మ్మది నొకనూతనత్వమును
మానముఁ బుట్టదె? నాస్తికాగ్రవా ।
గ్వాదునకుఁగూడ నీశ్వరుని
పెంపుస్ఫుటమ్మగ గోచరింపదే ॥ 7

చ॥ అసమకళా ప్రభాజయ శ
తాంగ రథాంగమునందుఁ జిక్కి, మా । *
నసమతి నూత్నభావ భువ
నావళిలోఁ జరియించి తుచ్ఛతా ।

---

*రోముదేశమునందు యుద్ధమునందోడినవారిని గెలిచినవారి రథచక్రములకుఁ గట్టి వారెక్కడికిఁ బోయిన నక్కడ కీడ్చుకొనుపోవు నాచారము. ఇక్కడ చూపఱయొక్క మనస్సులు లోపలికివచ్చిన కొంతసేపటి వఱకును ప్రాపంచిక సంబంధములైన ధనాదిచింతనలలో మునిఁగియుండఁగా నీకళా విలాసములు వారిమనస్సులను జయించి తమవైపీడ్చుకొనును. అట్టి యాకర్షణమే జయశతాంగ రథాంగలగ్నతగా భావింపఁబడినది.

ప్రసవములైన స్వార్థపర
భావము, ద్వేషము దూరభూమిలో।
విసరి విశాల దృష్టియు వి
వేకముఁ గాంచ దె యిందుఁ జొచ్చినన్ ॥ 8

చ॥ తన నివసించుకోనఁబడి
తక్కినలోక మెఱుంగ కుండఁగాఁ।
జనియెడు మూర్ఖమానవులఁ
జంపెడునజ్ఞత, దీనిఁగాంచ, నా।
శనమయి పోవదే? కళలు
సర్వమదృశ్య ప్రభావమొప్పఁగా।
మనుజుల యుత్తమస్థితికి
మాఱని కారణరాజియౌఁ గదా! 9

చ॥ వివిధములైన వ్యక్తులకు
భిన్నతయున్నను మూలమొక్కటే।
యవునని తెల్పురీతి, పదు
నారగు కంబములొక్కరాతిలోఁ।
దివిరి యిమిడ్చి స్తంభముగఁ
దీరిచి మంటపమున్ ఘటించిరీ।
భువినిటువంటి వెన్ని చెడి
పోయెనో!, పూర్వుల కార్యరాజిలో ॥ 10

చ॥ ఒకఁడొక కార్యమున్ బర ప్ర
యోజనమూలమటంచు నెంచుచున్।
సకలవిధమ్ములైన యగ
చాట్లనుజెంది ఘటించిపోవ, నిం

‘‘పసరావిసు కరంబుల నెక్కి పాతితోఁ
దవిలి యమర్చి స్తంభయుగం దీర్చి మంటపముగా ఘటించిరి.- –’’



విఠ్ఠలరాయ దేవాలయములోని ముఖమంటపము
యొక్క దక్షిణభాగము.

*By kind permission of*
K. Nageswararao Garu.

కొంకఁడు స్వకీయలాభమున
　　　　కో మతిమేలొకొ, పాడొనర్చి, యా ।
సుకృతికి నాశనమ్ము నొడ
　　　　నూపఁగఁజేయునదేమి పాపమో ॥ 11

మ॥ ఉదయోద్ధూత హిమానిలంబు బిగువుల్
　　　　ప్రోద్యద్ప్రభారాజిచే ।
నుదయార్కుండు వికాసముల్, జలము శై
　　　　త్యోద్రేకముల్ గూర్పఁగా ।
హృదయానందముఁ గొల్పుచుండు కదళీ
　　　　వృక్షంబుఁ దుండంబుచే ।
మదనాగంబు పెకల్చదే ఖలులు ధ
　　　　ర్మంబెంతురే యెగ్గులన్ ॥ 12

మ॥ క్షణమాత్రమ్మెటువంటి జంతువునకున్
　　　　సంతోషముల్ గూర్పఁ గా ।
రణమౌ మానవపుట్టు ధన్యమనుచోఁ
　　　　బ్రాక్పశ్చిమాశాంతభూ ।
జనముల్ సూచినయంత మెచ్చుకొను నీ
　　　　స్థానంబు నిర్మించుటన్ ।
గణనాతీతుఁ డనంగనౌ సుకృతి యె
　　　　క్కాలంబు వర్థిల్లెనో ॥ 13.

చ॥ ఇనుఁడపరాబ్ధిఁ గ్రుంక జగ
　　　　మెల్లెడ సంతమసంబు నిండఁగాఁ ।
దన హృదయంబు విచ్చి నలు
　　　　తావులఁ దావులఁ జల్లుమల్లికా ।

వనకుసుమంపురీతి జన
వారము లాగుచునుండు సత్కళా!
జనిత పరిమళస్ఫుట వి
శాలహృద్బ్జము వానికొప్పదే ॥ 14

మ॥ శిలపై నిట్టి విచిత్ర సృష్టిఁ గొలుపన్
జింతింపఁగాఁ జాలు, నా ।
విలసద్దివ్య రసజ్ఞ భావమితర
ప్రీతిన్ బ్రకాశింపదే ? ।
విలయంబందు సమస్త వస్తుచయమున్
జెన్నొంద్రతో మ్రింగు నో ।
చలకాలంబ ! త్వదీయ కుక్షిఁగలయా ।
సన్మార్గుఁ జూపింపవే ॥ 15

మ॥ తొలియేమూలనో ? యంతమున్ గలదొ లే
దో ? నీకునోకాలమా ?
యిలలో మర్త్యులెఱుంగఁజాలని నిజం
బెల్లన్ద్వదీయోదర ।
స్థలినేకోణములోనొ గన్గొనమె! త్వ
త్సర్వాతిరిక్తప్రభా ।
వలయంబేనెఱుఁగంగఁ జాలుదునె! య
ల్పజ్ఞాన హీనాత్ముఁడన్ ॥ 16

మ॥ ఒకనాఁడొక్క ప్రదేశమందు విభవ
మ్మొప్పారు నచ్చోట నిం ।
కొకనాఁడంతయు శూన్యమౌను ఘనగ
ర్వో ద్రిక్తుఁడౌ పూరుషుం ।

ఢాకచోభగ్నతనొందు నన్నియును నీ
వెక్కుడ వీక్షించుచుఁ ।
ప్రకటింపంగఁ దలంపవేమి ! తగునా !
మానంబు నన్నిల్వఁగా ॥ 17
మ॥ అపరాధంబులు లేని సజ్జనుఁడు మా
యజ్ఞాన మూలమ్మునచే ।
నపవాదంబున కింధనంబగును,మా
యాజాల సంయుక్తుఁడై ।
కపటాత్ముండగు కుత్సితుండొకట వి
ఖ్యాతుండు గాకున్నె,నీ ।
కృపఁజూపించి యథార్థముస్ దెలిపి మా
కీ యల్పతఁ ద్రోయవే ॥ 18
చ॥ జలనిధియందు ముత్యములు
సన్మణిరాసులు నత్తగుల్లలుఁ ।
గలసి యొకించుకేర్పడక
క్రాలెడురీతిని, సజ్జనుల్ మహా ।
ఖలులును, మంచిచెడ్డలును
గాలము! నీయుదరమ్ము లోపలఁ ।
గలసి వసించునందు నిది
గట్టినసజ్జనుఁ డెవ్వఁడోగదా ! ॥ 19
ఉ॥ ఏలొకొ! యెన్ని పల్కినను
నించుకమాఱిడ కుండనుంటివొ ।
కాలము! మాహితంబుకొఱ
కా!యిటువల్కక యుండుటెల్ల ! శ్లా ।

ఘాలయులైన పూరుషుల
యల్పతలన్నియు మేమెఱుంగ, శాం ।
త్యాలయమైన మా హృదయ
మాకులితమ్మగునంచు నెంచితో ॥ 20

*చ॥ అదినిజమైన నయ్యెడున
నంతమనుష్యకుతూహలంబు ని
ల్వదు, గతకాల మందలరు
వారిచరిత్ర లెఱుంగకుండినన్ ।
మృదుల తనూవిలాసముల
మిక్కిలిభాసిలు నాగుఁబాము మేన్ ।
బ్రిదులకపట్టఁడే శిశువు
పెద్దలుమొత్తిలు వెట్టుచుండినన్ ॥ 21

మ॥ గతకాలమ్మను చీఁకటిన్ గవుల స
త్కావ్యాళి దీపంబులై ।
సతతంబున్ వెలిగింపఁగా విషయముల్
స్వల్పంబు గన్పించు, నా ।
వితతాయాసనిమగ్న మార్గమును సం
వేద్యంబుఁ గావింపనా ।
తతయత్నంబు నొనర్ప రే? భువిచరి
త్రన్ గూర్చు సంశోధకుల్ ॥ 22

---

* ఇచ్చట నాగుబాము మేనిఁబట్టు పిల్లవానికిని, గతులైన పూరుషుల చరిత్రల నెఱింగి, వారంతవఱకును గొప్పవారను కొని వారి యల్పతలన్నియుఁ బైలుపడఁగా మనశ్శాంతిఁదక్కి విచారించు చారిత్రికపరిశోధకునకును నుప మానోపమేయభావము.

ఉ॥ నూతనమైన షట్కృని మ
నూత్తముగాథను వ్రాసి కైతకున్ ।
దాతగు పెద్దనార్యుఁడు ము
దమ్మున సత్కృతిఁ జేసె దీని ని ।
ర్మాతకుఁ గృష్ణరాయలకు,
మానితవైఖరిఁదచ్చరిత్రమం ।
దాతఁడు వ్రాయఁడే కల య
థార్థము మాకు స్ఫురింపఁ జేయఁగా ॥ 23

చ॥ ధరపయి శాశ్వతమ్మగు వి
ధమ్మునఁ గ్రాలునటంచు దీనినీ ।
విరవుకొనంగఁ జేసితిది
యిట్లు వినాశము నందునంచు నీ ।
వరయవు కృష్ణరాయ ! భవ
దచ్ఛయశమ్ము తెలుంగువారి కం ।
దఱికిఁకఁ బెద్దనార్యుని క
తాననె గోచరమయ్యెనిత్తఱిన్ ॥ 24

చ॥ మనుచరితమ్ముఁ జేతఁగొని
మానితుఁడౌ ప్రవరాఖ్యు శీలపున్ ।
ఘనతఁదలంచి ఱిచ్చవడి,
గానవిలోల వరూథినీమదిన్ ।
గనుఁగొని కోరనట్టి రసి
కాత్ముఁడు పాఠకులందు నొక్కఁడుం ।
డునె కవితాపితామహుఁడ!
నొక్కివచించెద నెన్నిసారులేన్ ॥ 25

మ॥ కవులున్ బండితవర్యులున్ నటకులున్
గాన్యజ్ఞమంత్రీంద్రులున్ ।
వివిధానేకకళావిలాసచతురుల్
పేరోలగం బుండఁగాఁ ।
గవి పెంజేరిపుఁ బెద్దనార్యుఁ సకలం
కారంబుగాఁ దోడ్కొని ।
భవమున్ ధన్యముఁ జేసితో క్షితివిభ రా
ష్ట్రైకచూడామణీ ॥ 26

ఉ॥ నాలుగుచోట్లనుండు కవి
నాథులనందఱ నీసభాస్థలిన్ ।
బాలన చేసి నిల్పితివి
పండితులన్నఁ ద్వదీయశ్రోత్రభద్ర ।
వ్యాలయముల్ సదా తెఱచి
పట్టవె! కైతలతీపి రోమకరా ।
పాలనుగూడ నిండివెలిఁ
బాఱెను నీకస, సత్యమౌఁగదా! ॥ 27

సీ॥ పండితులుద్దండ వాదముల్ సల్పెడు
శాస్త్రాలవిజ్ఞాన సంపదలును ।
భావసంపదనెల్లఁ బాషాణతతిపైని
మొలపించు సత్కళా పూర్ణతయును ।
గలవులేకపిల్లక కష్టమున్నెఱుఁగక
బ్రతికెడు తుష్టియు స్వాతంత్ర్యములు ।
భారతవిజ్ఞాన పావనక్షీరముల్
ఎత్సలకనుబంచు పాతనములు ॥

గీ॥ నీవు గతియించు నంతనే నిలిచిపోయె,
పేరుమాత్రమ్ము తలఁచుచుఁ బెద్దయూర్పు।
పుచ్చుకాలమ్ము వచ్చెనో పుణ్యపురుష!
రమ్యగుణసాంద్ర! శ్రీకృష్ణ రాజచంద్ర! 28

సీ॥ నిరతమ్ము నినుఁ జేర నరుదెంచు పండిత
బృందమ్ము నెటనొప్ప గించితీవు।
బాలభానునిఁ గాంచు వైఖరి నినుఁ గాంచు
ప్రజలకు నేమని పలికితీవు।
నీపోషణమునంది నెగడుచుండెడి వచ్చు
మల్లు రెండు చెటికిం బనిచితీవు।
చిత్రలేఖనమందు శిక్షితులై వచ్చు
సూరుల కేదారిఁ జూపితీవు।

గీ॥ ధరణి భారమ్ము దిగఁద్రోసి తరలునపుడు
నిలుచు నీప్రజయందున నెనరు లేదె?
వారికందఱ కెచ్చోటఁ బట్టు గలదు?
పురుషపుంగవ! శ్రీకృష్ణ భూమిచంద్ర! 29

సీ॥ వెనులోయఁ బడివచ్చు ఘనఘనీస్వనమునా,
నరుదెంచి యలరించు నాటకవిత।
విమమనమస్యల వినినంతఁ బూర్తిగా
వించి మెప్పించెడు విద్యశక్తి
నవరసమ్ములఁ గూర్చి నననవకేతులఁ
గావ్యాలవెలయింపఁ గలుగు కవిత।
యవసరమయినచో నకలంకముఁ గలంక
మనిదైన ననిపింతు మనెడు ఘనత॥

గీ॥ పండితాళుల కెవ్వరి § కుండకుండ
నింకిపోయెను నీవుగ § తించునంత ।
మృగధరుఁడు ప్రావ శశిశిల § లెండునట్లు
ధీరగుణజాల! శ్రీకృష్ణ § దేవరాయ ॥ 30

సీ॥ కప్పమ్ములీనట్టి § కర్ణాటరాజుల
దండించి యిచ్చును § ద్దండశక్తి ।
గర్వానఁగన్నులు § గాననిగజపతి
దొడ్డి దోలినమహా § దోర్బలంబు ।
మలయాళయోధుల § మల్లాడి యధికార
మీఁదు లేకయె చెలా § యించుఘనత ।
యేనాఁటికిని జంకు § నెఱుఁగనితురకల,
నదిమిపట్టినయాప § రాక్రమంబు ॥

గీ॥ గ్రంథములలోన మాత్రమ్మ § గాంచనయ్యె
శౌర్యనిధులెల్ల శోషించి § సమసిపోయె ।
బ్రతికియున్నాము జీవచ్ఛ § వాలపగిది
సమరసింహామ! శ్రీకృష్ణ § సార్వభౌమ! 31

సీ॥ ఉదయపర్వతదుర్గ § ముద్ధతిభేదింపఁ
జూపినయాంధ్రుల § శూరచరిత ।
కొండవీడు పురమ్మఁ § గొట్టింప ఘామ్మని
ప్రేలునాంధ్రుల ఫిరం § గీలమ్రోఁత ।
రాచూరుముదిగండ్ల § రాజులసేఁచఁగాఁ
దెలుఁగువారలు చూపు § చలముబలము ।
శివసముద్రపుఁ గోట § చెండాడు సమయాన
సమరభూమిని జూపు § సాహసమ్మ ॥

గీ॥ బీజరూపమ్ము దాలిచి § వెలయు నేమొ
యాంధ్రజనముల రక్తంపు § టణువులందు।
బలముగానుండు కారణం § బలరు నేని
దీప్తిగాంచునో యేమొకో § తెలియరాదు।
రమ్యగుణపాళి! శ్రీకృష్ణ § రాయమౌళి! 32

సీ॥ తూరుపుదిక్కునఁ § దూరుపుఁదీర మే
పెట్టనిహద్దుగా § వెలుఁగుచుండ।
నపరదిక్కునఁబశ్చి § మాద్రులు మిన్నుత్రోవ
దాఁకెడునెల్లయై § తనరుచుండ।
దరిలేని వార్నిధి § దక్షిణమ్మున దాఁటు
వీలుగాకుండఁగ § వెలయుచుండఁ।
బరిపూతగౌతమీ § పరిసరక్షేత్రమ్ము
లుత్తరసీమయై § యొప్పుచుండఁ।

గీ॥ బరమువిస్తీర్ణమైయున్న § వసుధయెల్లఁ।
బాలనముసేయునాంధ్రుల § భాగ్యమహిమ!
మఱలనొకసారి కలుగుట § యెఱుఁగమయ్య!
సర్వగుణసీమ! శ్రీకృష్ణ § సార్వభౌమ! 33

సీ॥ శాతకర్ణికరాగ్ర § సందీప్తమై తొల్త
నలరిన యాంధ్రశౌ § ర్యాగ్నికణము।
రాజరాజనరేంద్ర § రాజ్యకాలమునాఁడు
జ్వాలయైవెలుఁగంగఁ § బరిణమించె।
కాకతీయులబాహు § గర్వరూపమ్మున
శత్రురాజులను భ § స్మమ్మొనర్చె।

తరువాత నీపేర్మి ఽ దశదిక్కులను నిండి
యాకాశవీధికిఁ ఽ బ్రాఁకిపోయె ।
తే॥ నీవు గతియింపనేలొకో ఽ నిలిచిపోయె ।
బాహ్యదృష్టికిఁ గానంగఁ ఽ బడమిగాన ।
నివురుగవిసెనో, యాఱెనో, ఽ నేనెఱుంగ ।
సకలగుణధామ! శ్రీకృష్ణ ఽ సార్వభౌమ ! 34
తే॥ ఆంధ్రకవులకునిఁక నెన్నఁ ఽ డైనఁగలదె ।
రాజరాజకృతానేక ఽ ప్రణుతివితతి ?।
ఆంధ్రవాఙ్మయమభివృద్ధి ఽ నలరఁగలదె ?
సరసకవిపోష ! శ్రీకృష్ణ ఽ సార్వభౌమ ! 35
ఉ॥ ఎందఱురాజులిచ్చట జ
నింపరు ? వారలనెల్లనిట్లు మే ।
మందఱమున్ నుతింతుమె ? మ
హామతినెవ్వఁడు లోకవృద్ధి నా ।
కుం దగువేతనమ్మునుచుఁ
గుందక దేశపుసేవసేయు వా ।
నిందగురీతినెల్లరును
నిత్యముస్తోత్రమొనర్పకుందురే ? ॥ 36
సీ॥ అక్షరలక్షల ఽ నర్పించు భోజుచే
సంస్కృతమ్మేరీతి ఽ పాఁకఁబడియెఁ ।
పెరిక్లిస్సుకాలానఁ ఽ బెద్దయై గ్రీసులో
వాఙ్మయమేరీతి ఽ వన్నెఁగాంచె ।
లాటినుబాసకు ఽ లభియించె నేలాటి
గరిమమగస్టసు ఽ కాలమందు ।

గీ॥ ఆంధ్రకవులను నిఁకనెన్నఁ । డైన గలవె ।
రాజరాజకృతానేక । ప్రణుతి వితతి ।
ఆంధ్రవాఙ్మయ మభివృద్ధి । నలరఁ గలదె ।
సరసకవిపోష । శ్రీకృష్ణ । సార్వభౌమ ॥



౧౮. శ్రీకృష్ణదేవరాయలు.

నాంగ్లవాఙ్మయమెట్టు  లత్యున్నతమ్మయి
భాసిల్లె నెలిజబెత్  పాలనమున ।
గీ॥ నట్లె నీకాలమందున  నలరెఁ దెలుఁగు ।
వాఙ్మయమ్ము నీకీర్తి  పండుకొనియె ।
చరితయందు నీ పేరు  శాశ్వతమ్ము ।
సరసగుణధామ ! శ్రీకృష్ణ  సార్వభౌమ ! ॥ 37

ఉ॥ కీరితియన్న నేమి ? యది
కేవలమన్యుల వాక్కుపైని నా ।
ధారముఁగాంచి నిల్చునుగ
దా ? యటువారుస్తుతించునంతఁ జే ।
కూరిన దేమి మాకనుచుఁ
గొందఱు స్వోదరపూరణక్రియా ।
సూరులు పల్కుచుందురది
చొప్పడ నేర్చునె ? యెన్నఁడేనియున్ ॥ 38

చ॥ జనులు మహాత్ములన్ స్తవము
సల్పుట, వారలకార్యరాజికి ।
న్ననువగు పారితోషికమ
టంచుఁ దలంచుట కాదుగాని, యో ।
ఘనమతులార మీకుఁదగు
గాన్కలనల్పుల మేమియీయలే ।
మనుచు వచించుటేయగు ; య
ధార్థము శోధనచేసి చూచినన్ ॥ 39

ఉ॥ శారద పూర్ణిమానిశల
సాంద్రవినిర్మల కాంతి పూరముల్ ।

ధారుణిఁజల్లు చందురుని
లాభము మాట పల్కుచునే? యయా।
పూరిత చిత్తవృత్తులౌ
పుణ్యస్మృతిన్ బొసరించుచున్నవో।
మారు ఘటిల్లునంచుఁ బమ
మానసమందుఁ దలంపఁబోదురా॥ 40

మ॥ వినుమార్గంబున నుండి వారికణముల్
పృథ్వీస్థలిన్ జేరఁగాఁ।
గనమే? యయ్యవి యేరి ప్రార్థనను ప
త్కార్యంబుఁ గావించు నీ।
ఘనలోకావన శీలురెల్ల ఫలమున్
గాంక్షింపకుండన్ సదా।
పనులం జేయరె? వారిసల్లాపింపన్
ప్రార్థింపు నే యెవ్వరిన్ ॥ 41

ఉ॥ ఆరయనట్లొనర్చెదు మ
హాత్ములఁ గీర్తిశాలి పొందును।
వ్యాపియశస్సు సౌరభము
వంటిది; పూలు వికాసమందుటల్।
సౌరభప్రాప్తిఁ గోరుటనొ?
చక్కఁగ విచ్చిన పూవులందు ది।
త్కారణయుక్తి వాసనలు
గల్గకయున్నె? తలంచి చూచినన్॥ 42

ఉ॥ కానఁద్వదీయకీర్తిలతి
కల్ భరతావని వ్యాప్తిఁగాంచి వి।

ద్యానిధులైన యన్యవిష
యాగతపాంథుల దివ్యవాక్యసం।
తానము నూతఁగైకొని య
నంతవిధమ్ముల నెల్లచోటులన్ ।
బూనికఁ బ్రాఁకిపోయెఁ గవి
పోషక! ధీవర! కృష్ణభూవరా ! 43

ఉ॥ ఎందఱు రాజులీజగతి
నెల్లెడఁ బాలనసేయలేదు ! వా।
రందఱిలోన నెందఱు మ
హామతిఁ బాండితిఁ గాంచినారలం ।
దెందఱు కావ్యపాళి విర
చింపఁగయత్న మొనర్చినారు త ।
ద్బృందములోనఁ జుక్కలను
వెల్గువిధుండన వెల్గుచుండవే॥ 44

గీ॥ ధనము గల్గిన విజ్ఞాన ధనము లుండరుడు
పేదతనమున కతిథి కశ్వరుండు ।
రెండుఁగలిగిన సౌజన్య మందుండఁ బోదు ;
ఇన్నియున్నఁ బరాక్రమ మెన్న సున్న॥ 45

సీ॥ ఐశ్వర్యమా! విశ్వ విశ్వంభరాభార
గౌరవంబును లీలఁ గాఁ దలంచు ।
విజ్ఞానమా ! సర్వ విద్వన్మణీ దివ్య
దీప్తి ప్రకాండమ్ము ధిక్కరించు ।
సౌజన్యమా! గుణి సంఘ శిరోవీధి
స్థాపించె నీపేరు శాశ్వతముగ ।

విక్రమం బా! వర కవీరరాజన్యహృత్
సీమలం దెవుడుం బ్ర కతి ధ్వనించు ॥

గీ॥ నన్నిగుణములు నిన్నట్టు కలాశ్రయించె
నక్కజంబయ్యో! లోకాన కనొక్కచోటఁ।
గూడియుండని గుణములు కగూడెనిన్ను
సరసగుణధామ! శ్రీకృష్ణ కసార్వభౌమ ॥ 46

ఉ॥ ఎవ్వరు విద్యనేర్పి నిను
నింతటివానిగఁ జేసిరయ్యా, నీ।
వెవ్వరి యాజ్ఞలోఁ బెరిఁగి
యింతటి కీర్తిగణించియుంటి, ని।
న్నెవ్వరు పోరిలో సమన
రించుచు నెప్పుడు రక్షసేతురిం।
కెవ్వరు నీకు మంత్రిగ ప
చింతురు సత్పరిపాలనావిధిన్ ॥ 47

సీ॥ చాణక్యకార్యసి కతూ పరత హసించి
హిందు రాజ్యంబు స్థా కపించె నెవఁడు।
ఊరూరముప్పత్తి కయున్నత మా నర్థ
శాస్త్రమ్మునేరువఁ కజాలె నెవఁడు।
మంత్రి యుగంధరు కమాత్రమేన టియన్
విధి సంధిపనులఁగా కవించె నెవఁడు।
విదురుండు దనుఁ జూచి కయెదమెచ్చుకొనవచ్చు
గతినీతిదెల్పిన। ఘనుఁడెవండు।

గీ॥ అట్టిఁడైనట్టి తిమ్మరు కసయ్యనిలిచి
వేయికన్నుల నినుఁగను కపెట్టుచుండ।

లోటునీకెట్లు గల్గునీ ౯ లోకమందు
సరసగుణధామ! శ్రీకృష్ణ ౯ సార్వభౌమ ॥ 48

ఉ॥ ఇన్నియొనర్చు దిమ్మరుసు
నెన్నికఁ బూజలొనర్చి యప్ప యం ।
చెన్నుచునుండి సత్సభ న
నేకనమస్కృతులన్ బొనర్చి నీ ।
కున్నకృతజ్ఞతన్ దెలుపు
కొంటివి రాజ్యము వానిచేతిలో ।
న న్నిలుపంగ సంశయము
నందపు శ్రీనర ! కృష్ణభూవరా! ॥ 49

మ॥ తనచిత్తంబున హిందురాజ్యమొటులేన్
స్థాపింప సంకల్పమున్ ।
బొనరించెన్ దొలి తిమ్మమంత్రి, యది సం
పూర్ణంబు గావింపఁ గాఁ ।
దన సామ్రాజ్యము నేలఁగాఁదగిన స
ద్రాజన్యు నిన్నాయిత ।
మ్మొనరించెన్ నిజబుద్ధి వైభవము ని
బ్బాభిన్ సదాచాటుచున్ ॥ 50

సీ॥ చిననాఁడు తనయంక ౯ సీమను జేరిచి
ముద్దాడి నినుఁగాంచి ౯ మోహమందె ।
నావెన్క నన్నివి ౯ ద్యలునేర్పి విద్వాంసు
నొనరించి నినుఁగాంచి ౯ తనివినొందె ।
నినుఁజంపు సంకల్ప ౯ మున నున్న నీయన్న
నెట్లొ నమ్మించి ర ౯ క్షించె నిన్ను ।

నుత్కళేంద్రుని తోడి ॥ యుద్ధాన నోటమి
లేకుండ సంధిఁ గ ॥ ల్పించె నాఁడు ॥
గీ॥ నీకు శ్రీరామరక్షయై ॥ నెగడె నెపుడు
దేశవృద్ధియె మనసులోఁ ॥ దేజరిల్ల ।
నాత్మలాభంబు నెంతయు ॥ నణఁగఁద్రొక్కి
స్థిరతఁబనిచేసి నీమంత్రి ॥ తిమ్మమంత్రి ॥ 51
సీ॥ తనకు సరియయిన ॥ ఘనమంత్రి లేకుంట
నలపృథ్వీరాజేంద్రుఁ ॥ డడఁగిపోయె ।
సరిదైన ప్రభువులు ॥ దొరకక రాక్షసుం
డోడెను నందరా ॥ జ్యోద్యమమున ।
తనలాభ మెఱుఁగక ॥ ధరణిని జయచంద్రుఁ
డద్బెంచెగోరీకి ॥ నాహవమున ।
దర్పమేయనియెంచి ॥ తంత్రమ్ము నెఱుఁగక
భూమిఁగోల్పోరె రా ॥ ట్పుత్రవరులు ॥
గీ॥ వారివలెఁగాక జయముతో ॥ వఱలి మీఁదు
మహిపునకుఁ గూర్పు సచివుండు, ॥ మంత్రివర్య ।
మాటదాఁటనిరాజుగా ॥ మసలియుంటి ।
రందఱకుఁగూడ నాదర్శ ॥ మనఁగనలరి ॥ 52
గీ॥ చంద్రగుప్తుఁడు చాణక్య ॥ సచివవరుఁడు
గాక భారతసామ్రాజ్య ॥ గగనమందు ।
వెదకి చూచిన యీడైన ॥ వెల్గుగలడె !
రమ్యగుణగేయ ! శ్రీకృష్ణ ॥ రాయ మీఁదు ॥ 53
మ॥ అకటా ! యిట్టి పవిత్రభూములను దే
శౌన్నత్యముఁ నిల్పను ।

త్పుకలన్ దేహము ఖండ ఖండములుగాఁ
దూలించి ర క్తంబు జం।
కకయే తర్పణమిచ్చినట్టి జన సం
ఘాతంబుచేఁ బూతమై।
ప్రకటంబైన స్థలంబువీడి మరలన్
వాసంబుఁ గాంక్షింతునే॥ 54

గీ॥ పాపభూయిష్ఠమైయున్న ౹ వాసమునకుఁ
బోవఁజాలను, దాస్యంపు ౹ భూతమునకుఁ।
గబళమై వెండి సేవకుఁ ౹ గడఁగఁజాల।
నిచ్చటనె నిల్చి బ్రతుకు సా ౹ గింతుఁగాక॥ 55

చ॥ గొనముల ప్రోవులై ప్రజల
కోసమెపాలనఁ జేయనెంచి, యా।
జనములొసంగు పన్నులకు
సద్వ్యయమున్ ఘటియింప ధర్మక।
ర్తననుచు నే మహీధవుఁడు
దల్చుచు నుండునో వానిచెంత దా
నొనరుచు సేవ సేవ, యది
యుండక పోయినసేవ దాస్యమే॥ 56

గీ॥ అనుచు నిట్టూర్పుఁ బుచ్చుచు ౹ నాతఁడంత
మరలదొడఁగెను నాఁటికి ౹ నిరవుఁజేర।
న స్తమయమునఁ జీఁకటు ౹ లలముకొనఁగ
దిక్కుతోఁచక పోవుటఁ ౹ దెలివి దక్కి 57

శా॥ ఆకాశంబుననన్ని దిక్కులుఁ దమో
వ్యాప్తంబులై యుండె, స।

ర్వాకారంబులు దృక్పథంబుఁ దొలఁగెన్
    బ్రాక్సీమదగ్ధాశు నా।
శాకందంబున నక్కడక్కడెపుడేన్
    సంభూతమౌ, క్రౌంజ వు।
శ్శైళ్కన్పట్టెఁగువాల బాంధవుని ప్ర
    త్యగ్రప్రభాంకూరముల్ ॥ 58

గీ॥ నేలనెల్లెడ గ్రీకుల కై పాలఁబడఁగఁ
గొంచె కొంచెము సైన్యముఁ కై కూర్చుకొనుచు।
పెంపుఁగను చంద్రగుప్తుని కై విధముదోఁపఁ
జంద్రబింబము ప్రాగ్దిశ కై జ్వలితమయ్యె ॥ 59

ఉ॥ అత్తఱి నిండువెన్నెలల
    యచ్ఛపు వెల్లువలో మునింగి యా।
పత్తన శీర్ణ గేహము ల
    పారపవిత్రతతో వెలింగె రా।
పెత్తిన నాశనమ్మనఁగ,
    నెల్లెడనున్న విశీర్ణ కుడ్యముల్।
చిత్తమునందు శాశ్వతపుఁ
    జిత్రముగా లిఖియింపఁ గాఁబడెన్ ॥ 60

ఉ॥ వేలకువేలు పూరుషులు
    వేడుకమీఱఁ జరించినట్టి యా।
ప్రోలను, నెచ్చెలుల్ గలసి
    పొందులమోదపు పొంగులందు నున్ ।
దేలినయట్టి చోటులను,
    నిర్మలశారదచంద్రకాంతి నీ।

నేలకు నెల్ల నేలికను
నేననురీతిని రాముఁ డేగుచున్ ॥ 61

గీ॥ దేవళముఁ జేరి పంపాప ✽ తికిని మ్రొక్కి
భోజన మొనర్చి నిద్దుర ✽ ఫ్రూవఁ బోడఁగెఁ ।
బాడుపడియున్న యొక్కయా ✽ వాసమందుఁ
దనదు చైతన్య మొచటికో ✽ చనియె ననఁగ ॥ 62

ఉ॥ అక్కడ నిద్ర పోవుటనో
యచ్చట నే నివసింప నెంచుచున్ ।
బెక్కులు యోజనల్ సలిపి
మేనటు వాల్చుట చేతనో, మే ।
మొక్కటె యుండఁ గాలమతఁ
డొక్కకలన్ గనె నాఁటి రాత్రి, యం ।
దొక్క మహా మహుండు కను
దోయికిఁ గట్టిన రీతిఁ దోఁచిసన్ ॥ 63

ఉ॥ తెల్లని కల్వరేకులను
ధిక్కృతిఁ జేయు కనుల్ విశాలమై ।
చల్లని మోము దమ్మిపయి
శాంతినిఁ జాటఁగ, మేని చుట్టువ ।
ర్థిల్లెడు సూక్ష్మ మాపరిధి
దివ్యశరీరతఁ దెల్పుచుండ, మై ।
యెల్లఁ గషాయ వస్త్రముల
నింపు ఘటింపఁగఁ దోఁచె నాతఁడున్ । 64

గీ॥ దివము నుండియె దిగివచ్చు ✽ దేవతయన
జ్ఞానసారమ్ము లోకాన ✽ మేను దాల్చి ।

తిరుగుచున్నదో యనునట్లు § తేజరిల్ల
నేడనో నిల్చి తపమొన § రించుకొనుచుఁ ।
గాలముగడపు సిద్ధుండు § కాలగతిని
దివ్యరూపమ్ము దాలిచి § తిరుగవెడలె ।
ననఁగవాని మదిని నాతఁ § డవతరించె
స్వప్నమెప్డు మానసికాను § భవముగాదె ॥ 65
గీ॥ పుణ్యపురుషులఁ గాంచినఁ § బుట్టునట్టి
యనుభవములెల్ల రామున § కయ్యెఁ బ్రాతి ।
భాసికవ్యావహారికా § వస్థలకును
నరయసత్తమాత్రమె భేద § మగును గాదె ॥ 66
ఉ॥ మేనను బుట్టు కంపమున
మెల్లన లేచి నమస్కరించియా
మానవరూపధారియగు
మాన్యుని వైపు వితాకుతో స్వకీ ।
యానన మొప్పఁ, గాంచుచు మ
హావినయమ్మునఁ బల్కెనిట్టులో ।
ధీనిధి మిమ్ముఁ బూర్వమొక
తేపయుఁ జూడ క్షమింపుఁడీ నను౯ ॥ 67
శా॥ స్వామీ! మీదగురూపము౯ గనిన నా
శ్చర్యంబుగాఁ జొచ్చె,నీ ।
భూమి౯ బూత మొనర్పఁగాఁ దిగిన యా
భూతాధినాథుండవో ।
శ్రీమచ్ఛంకర పూజ్యపాదుఁడవొ! యో
చింపంగ వీల్గాదు నా ।

కే మాత్రంబు వచింపు మేదయిన నా
కృత్యంబు గాంక్షించుచో ॥ 68

గీ॥ జటియునిట్లనె నారామ ! చంద్రుతోడఁ
జేరితోనేమి కార్యంబు ? వెలయు నీకు ।
బాలకుఁడ వాట హితమును ? బలుకనెంచి
యరుగుదెంచితి నాపల్కు ? లరయు మీవు ॥ 69

మ॥ నినునాధారము గాఁగఁజేసి యెటులే
నీజీవవార్ధిం దరిం ।
పను జింతించెడువారి సంగతిఁ దలం
పఁబోక యివ్వేటనే ।
యునికిన్ జేసుక యుండువాఁడననుచున్
యోచించు నీయూహ నే ।
మనఁగానౌననివీడివేచనుట మే
లా ! వీరుఁడౌవానికిన్ ॥ 70

ఉ॥ జీవనమెప్పుడాహవము
సేయుటవంటిది, దానిలోన నే ।
యేవిధినెవ్వఁ డెవ్వఁడు చ
రించునొ, యవ్విధి నున్నతిన్గనున్ ।
గేవలమొక్కమూలఁబరి
కింపక కాలముఁబుచ్చువానిదా ।
జీవముజీవమానె పరి
శీలనఁజేసిన నీవెఱుంగవే ॥ 71

చ॥ బ్రతుకొకపెన్ ప్రవాహము, ని
రంతరముఙ్ జలనంబెదానికిన్ ।

జతపడులక్షణంబు, చెయి
చాఁపక కాలుగదల్పకుండఁగా ।
బ్రతికెడువాని జీవనముఁ
బల్కఁగవచ్చునె జీవనమ్మనగా ? ।
సతతము గార్యభారమున
సల్పెడుజీవమె జీవమౌఁగదా ! ॥ 72

ఉ॥ మానవసంఘ మంపలుల
మాన్యత జీవము సేయకుండనీ ।
కోన వివిక్తదేశమునఁ
గొంకకయుండఁగ నెంచుచుండునీ ।
పూనినకార్య మేమి ? యది
పూర్తియొనర్పఁగ నెంచవేమి యీ ।
స్థానమున న్వసించుటనె
తాఁగృతకృత్యత నందవచ్చునే ॥ 73

ఉ॥ లోకము పాపపూరితము
లోకులధర్మలు స్వార్థలాభచిం ।
తాకలితాంతరంగులు గ
దా యటనే వసియింపనందువా ! ।
లోకములోనఁ జెక్కులగు
లోటులుగల్గుట లోకనైజమా ।
లోకులదిద్దఁగా వలయు
లో నివసించు మహామహుల్ సదా ॥ 74

ఉ॥ కోటులకొద్దిమానవులు
కూడివసించెదు చోటులందునే ।

లోటునుగల్గ కుండునొకో,
లోకము దోషవిహీనమైన న।
చ్చోటు రుచించునే తలఁచి
చూడఁగ, మిట్టలతోడిపల్లముల్ ।
వాటిలుచుంటఁ జూడమొకో ?
భాసిలునే జగమొక్కరీతిగా ॥ 75

మ॥ పరిపూర్ణంబనవచ్చు సత్ స్థితి మనో।
భావ్యంబ, యద్దాని ను।
ర్వరఁగన్గోవశమౌనె ? యైనఁ బరిపూ
ర్ణత్వంబుఁ గాంక్షించుచున్ ।
జరియింపంగ శుభంబు చేకుఱును న
త్నా ! కాని యద్దానిచేఁ
బరిపూర్ణత్వము లేనిదంచు నిరసిం
పంజన్నె లోకస్థితిన్ ॥ 76

సీ॥ క్రవ్యాదులున్నారు § గా! యని మధనమ్ము
విడి సురల్ పాఱిరే § విపినములకు ।
కౌశికుబాధల § కడఁగాంచఁ గా లేక
సత్యముడిగెనే త్రి § శంకుసుతుఁడు ।
దుర్యోధనాదులు § దుర్జనులని యెంచి
వనముల నిల్చిరే § పాండుసుతులు ।
క్షత్రియుల్ మత్తులు § గా ! యని తపమునకై
పోయెనే పరశురా § ముఁడు వనికి ॥
గీ॥ ధారుణీస్థలిఁ గ్రూరులు § న్నారటంచు
వారుసేసెడు సేఁతల § వనటఁ దాల్చి ।

వెడలిపోయిరె గిరులకు ¶ వీగవరులు
నిలిచి ధర్మంబు నిలుప య ¶ త్నింపలేద ॥ 77

ఉ॥ సేవయటంచు నిందలను
జేసెదుమాటికి సంతెకాని, యా ।
సేవకునర్థమేమిరి పతి
సేవలఁ బత్నియొనర్పకుండు నే? ।
సేవయొనర్పరే సుతులు
శిష్యులు బాలురు వృద్ధరాజకిఁ? ।
ఆ విధివారు సేయునది
యంతియు నింద్యమొ యెంచిచూడుమా ॥ 78

చ॥ ధనముగ్రహించి యొక్కరికి
ధర్మవిధంబునఁ జేయుసేవలోఁ ।
గననగుదోసమున్నదెరి జ
గమ్మున నొక్కఁడు లాఁతివారికిఁ ।
దనభుజశక్తినిచ్చి తగు
ద్రవ్యము దానికి మారుగాగ్రహిం ।
చినఁగల దోసమేమి, యటు
సేయకయున్న జగమ్ముసాగునే ః 79

సీ॥ జనపతి కడసేవ ¶ నొనరించి జీతమ్ముఁ
బొందఁడే సన్మంత్రి ¶ పుంగవుండు ।
ప్రజలను రక్షించి ¶ పన్నులఁదీయఁడే
రా రాజు సయితంబు ¶ రాష్ట్రమునను ।
గ్రంథమ్ము కృతినిచ్చి ¶ కవియును గాంచఁడే
మహిపుఁడొనరుచుస ¶ న్మానములను ।

శిల్పాదికళఁ జూపి కొ చేకొనఁడేశిల్పి
తగునట్టి ద్రవ్యంబు కొ ధరణియందు ॥
గీ॥ నిట్టిపనులెల్ల సేవగా కొ నెన్నఁబడిన ,
సంఘకార్యమ్ములెవ్వరు కొ సలుపవలయు ?
సేవయే కానిదని పల్కు కొ స్థితియుఁగలుగ ।
జనుల నాగరకతయెల్ల కొ సమసిపోదె ॥ 80
చ॥ తనమనమందుఁ దోఁపఁగల
ధర్మవిధానము నొక్కిపట్టి య ।
న్యునికడ దోసిలొగ్గుచును
న్యూనత నెంచక నీచకార్యముల్ ।
పొనరుచునున్న నయ్యదియె
పూరుషనింద్యము దాస్యమంద్రు దా ।
నిని, నదిగాదె సత్కృతుల
నింద యొనర్పఁ బడెౕ విశేషమున్ ॥ 81
గీ॥ నీదు కర్జము డాస్యమా! కొ నిర్ణయింపు ।
కానిపక్షాన నీకేమి కొ కష్టమయ్యె ।
సకల మానవసంఘంపు కొ స్థానమైన ।
పత్తనము వీడి యిటవసిం కొ పంగనేల ? ॥ 82
ఉ॥ లెమ్మ ! విశీర్ణపట్టణవి
లీనమహత్త్వము వీడి పొమ్మ జీ ।
వమ్మను నాహవమ్మనను
బంటుతనమ్ము వహించి మర్త్యసం ।
ఘమ్మును ద్రిప్పు మా ! బ్రతుకు
గర్హితమంచు దలంపకే స్వతే ।

జన్మును లోకమందు నలు
చాయలఁ జిమ్మ్నమ ! కీర్తిఁగాంచుమా ॥ 83

వ॥ అని వినినంతఁ ద్రుళ్లిపడిలేచి రామచంద్రుండు నాలుగు దిక్కులం బరికించి యెవ్వరింగానక స్వప్నంబుగదా యని యెంచుకొని యుదయం బగుటఁ గాల్యంబులఁ దీర్చి కొని తుంగభద్రానదీతోయంబుల స్నానంబొనరించి యక్షీణ మోక్షలక్ష్మీ సామ్రాజ్య విరూపాక్షుం దర్శించి మగుడ బయలుదేఱి యానాఁడె నిజనివాసంబునకుఁ జని స్వకృత్యంబుల యందప్రమత్తుండై యుండె ॥

తృతీయాశ్వాసము సర్వము

సంపూర్ణము.



Printed at the Ananda Press, Madras. —1930.

# తప్పొప్పుల పట్టిక.



| పుట సంఖ్య. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
| --- | --- | --- | --- |
| 10. | 20 | దొడంగె వానిపై | దొడంగెఁ బై |
| 27. | 4 | తోఢ్ర | తౌఢ్ర |
| 75. | Foot note | నక్కుడ | నక్కుడి |
| 85. | 5 | రాయమహాళి | రాజమహాళి. |



